సారస్వత గ్రంథావళి ౧౫.

# ప్రబంధపాత్రలు

## మొదటి భాగము

గ్రంథకర్త

కేశవపంతుల నరసింహశాస్త్రి, విద్వాన్, శిరోమణి.




ప్రకాశకులు:
ఆంధ్ర సారస్వత పరిషత్తు, రామకోటి, హైదరాబాదు—ద.

౧౯౫౨

# తొలిపలుకు

మానవుడు తన నైమిత్తికములు సరిగా సాగించుకొనుటకు వివిధ శాస్త్ర సూత్రములను పనిముట్లుగా ఉపయోగించుకొ గలుగవలెను. అట్టిశాస్త్రపరిచయము సులభమగుటకు సారస్వతప్రసారము విరివిగా జరుగవలెను. అట్టి సారస్వతవ్యాప్తిని కలిగించుటయే ఆంధ్రసారస్వత పరిషత్తు యొక్క ప్రధాన ఆశయము. సారస్వత ధారాశుద్ధి కలుగుటకు భాషా పటిమ సిద్ధింప చేసుకోవలసియుండును. భాషాపాటవమును గడించుటకు సాహిత్యాభినివేశము అవసరము. మన సాహిత్యమున ప్రబంధ యుగము స్వర్ణయుగముగా భాసించినది. అట్టి స్వర్ణరాసులను కరగించి ఉపయోగించుకొని అభ్యుదయ గాములగుటకు దేశీయులకు ఎన్నియో విధముల మన ప్రబంధములను పరిచయము చేయుటే కాదు అవి అవశ్య పఠనీయములుగా భావించ వలసినంత ఉత్కర్ష చిగురింపచేయవలసి యున్నది. ఇట్టి ఉద్దేశముతోనే శ్రీ శిరోమణి కేశవపంతుల నరసింహా శాస్త్రిగారు ప్రబంధ పాత్రల పరిచయము 'శోభ' పత్రికద్వారా చేసి యుండిరి. అవి అనేకులను ఆకర్షించినవి.

అట్టి వ్యాసములను పుస్తకరూపమున పరిషత్తు ప్రచురణగా వెలువరించుటకు శ్రీ కేశవపంతుల నరసింహా శాస్త్రిగారు ఆమోదించి పరిషత్తుయెడ,మాతృభాషపట్ల తమకుగలగాఢానురాగమును సేవాసక్తిని వెల్లడించినారు. పరిషత్తు చేయుకృషిలో, వారుపెక్కువిధముల పాల్గొనుచు తమరచననుకూడ పరిషత్తునకు ఒసగుట సామాన్య విషయముగ భావించలేము.

ఈ పుస్తకమును గురించి శ్రీ సురవరము ప్రతాపరెడ్డి గారును, శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారును దయయభిప్రాయములను దయతో వ్రాసియిచ్చినందులకు కృతజ్ఞులము.

భాషాభిమానులు, తోడిభాషాసేవకులు మా ఈ కృషిని ప్రోత్సహించ గలరని ప్రార్థన.

విధేయుడు

పులిజాల హనుమంతరావు

ప్రధానకార్యదర్శి ఆ. సా. పరిషత్తు

కవి, కవికాలము, కవిశక్తి, రచన, రచనలోని విశిష్టత, ముఖ్యముగా పాత్రలసృష్టి, వానిలోని యౌచిత్యము, ఇట్టివన్నియు శ్రీ శాస్త్రి గారు గొప్పసమర్థతతో తెలిపినారు.

వీరిశైలిలో పటుత్వము, ప్రౌఢిమ, ధారాశుద్ధి కలవు. గద్య నింత చక్కగా వ్రాయువారరుదు.

వీరిశైలి యీగ్రంథ ప్రాముఖ్యము నినుమడింపఁజేసినది. ఈగ్రంథము కళాశాల విద్యార్థులకు మిక్కిలి యుపయోగింపఁ గలదని నాయభిప్రాయము.

సురవరం

# శ్రీ సురవరం ప్రతాపరెడ్డి బి. ఏ., బి. ఎల్., గారి

## అభిప్రాయము

శ్రీ శిరోమణి కేశవపంతుల నరసింహశాస్త్రిగారు రచించిన "ప్రబంధ పాత్రలు" అను గ్రంథము మన ప్రాచీన వాఙ్మయమున కవసరమైన ముఖ్య విషయమును మనకందించినది. ఉత్తమ ప్రబంధాలను చదువువాడుక తగ్గుచున్న కాలములో పాఠకులకిది మూల జ్ఞాపకము చేయునట్టిది. వీరు గ్రహించిన పాత్రల చర్చలో సాహిత్యశాస్త్రదృష్టిని గూడఁ బరపినారు. పారిజాతాపహరణములో నారదుఁడు, మనుచరిత్రలో మాయాప్రవరుఁడు వసుచరిత్రలో గిరికా వసురాజులు, నీలాసుందరీపరిణయములో నీల, ప్రభావతీప్రద్యుమ్నములో శుచిముఖి, పాండురంగ మాహాత్మ్యములో నిగమశర్మ అతనిఅక్క, అను పాత్రలను గురించి విస్తరముగా విమర్శించినారు. ఈ పాత్రలలో నారదుఁడు దేవలోకమువాఁడు మాయాప్రవరుఁడు దేవయోని [illegible] వసురాజులు దే[illegible] లోకములో సంబంధము కలవారు, శుచిముఖి హంస, [illegible] కాని కంతగా సంబంధము లేనివారు, అయినను నారదుని పాత్ర సృష్టిలో చతురత, హాస్యము, సవతుల తగవుల వర్ణనము, మున్నగునవి మనసాకర్షించుటచేత అది చాల రమ్యమైనది. మాయాప్రవరుని నిజప్రవర పాత్రతోనియ మొక రమణీయ నాటకమువలె నున్నది. గిరికా వసురాజుల వర్ణనలు, వారి ప్రేమావస్థలు ప్రధానముగా గమనింపదగినవి.

మనల ముఖ్యముగా ఆనందింపజేయు పాత్రలు నీల, నిగమశర్మ అతని యక్క. నీల పౌరాణిక కన్యయైనను ఆమె మన తెనుఁగు [illegible]దైనది. అందుచేత మనకు మరింత దగ్గఱిదైనది. నిగమశర్మయు అక్కయు, సంపూర్ణముగా నాంధ్రులే. ఆంధ్రవైదిక కుటుంబ జీవన సినిమావలె మనకు చూపించిన రామకృష్ణుని సృష్టియే. యీ ప్ర[illegible]లన్నింటిలో నుత్తమమైనది.

## శిరోమణి శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారి

### అభిప్రాయము

శ్రీ శిరోమణి కేశవపంతుల నరసింహశాస్త్రిగారు రచించిన ప్రబంధ పాత్రలు (ప్రథమభాగము) అను గ్రంథము నామూలాగ్రముగాఁ జూచితిని. ఆంగ్లమునవిట్టి గ్రంథములు పెక్కుగలవు. కాని యాంధ్రమున బహుస్వల్పము.

ఈ గ్రంథమున నారుప్రబంధములలోని ముఖ్యపాత్రలను గ్రహించి సాంగోపాంగముగాఁ జర్చించి యాయా కవుల ప్రతిభావిశేషములను గన్నులకుఁ గట్టినట్లు వెల్లడించినారు. కొన్నియెడల నిశితమైన రస చర్చను గావించిరి. భాష సుందరముగా నుండి చదువరిని ముందు ముందుకు లాగుకొని పోవును. శాస్త్రిగారిది సునిశితమైన విమర్శనా పద్ధతి.

విద్యార్థులిట్టి గ్రంథములఁ జదివి చక్కని విమర్శనా జ్ఞానమును గడింపఁజాలుదురు కాన విశ్వవిద్యాలయాధికారు లీగ్రంథమును గళాశాల విద్యార్థులకుఁ బాఠ్యముగాఁ జేయుదురని యాశించుచున్నాను.

శాస్త్రిగారు త్వరలోనే ద్వితీయభాగమును గూడ రచించి ప్రక టింపఁ జేసినచో విద్యార్థులకుఁ జాల మేలొనర్చినవారగుదురు.

ఇట్టి యుత్తమ గ్రంథములను బ్రకటించుచున్న యాంధ్ర సారస్వత పరిషత్తువారు ప్రశంసాపాత్రులు.

సన్నిధానము
సూర్యనారాయణ శాస్త్రి

# విజ్ఞప్తి.

ఆంధ్రకావ్యములలోని రసాలంకార [illegible]దుల యౌచిత్యము మనోజ్ఞముగా నున్న విషయము సాహితీపరులకుఁ దెలియని యంశము గాదు. ఆయా కావ్యవ్యాఖ్యాతలు తెలిపియే యున్నారు. అయినను వానియందలి పాత్రౌచిత్యాదుల నొక్కచోటఁ జేర్చి సాహిత్యాభిమానులకును, విద్యార్థులకును సౌలభ్యమును జేకూర్చుటకై "ప్రబంధ పాత్రలు" అను గ్రంథమును విరచించుటకుఁ బూనుకొంటిని. సమగ్రమైన యీ గ్రంథమును ప్రకటించుటకు ముందుగాఁ గొన్ని పాత్రలను మాత్రము గ్రహించి యీచిఱుపొత్తమును ప్రకటించుటకై ఆంధ్రసారస్వత పరిషత్తు వారిచే నాదేశింపఁ బడితిని. ఈగ్రంథమును ముద్రింపించి నన్ను ప్రోత్సహించినందులకుఁ బరిషత్తువారియెడఁ గృతజ్ఞుఁడనై యున్నాను.

వ్యావహారిక రచనల కలవాటు పడిన యీనాటి చదువరుల సౌకర్యమునకై కొన్ని తావుల విసంధులను పాటించితిని. ఈగ్రంథము కేవలము పాత్రల గుణశీలములకై యుద్దేశింపఁబడి యున్నను గొందఱు విద్యార్థుల యవసరములను గుర్తించి కవి, కావ్యము, కవితావిశేషములు మున్నగు విషయములను సైత మిందులో స్పృశించితిని. సాహి[illegible]మానుల ప్రోత్సాహము లభించినచో నల్పకాలములోనే గ్రంథమును దెలుఁగు సరస్వతికిఁ గానుక పెట్టుట కాశించుచున్నాను.

అనంతముగా వెలసిన మన తెనుఁగు కావ్యములలోఁ గొన్నింటికి వ్యాఖ్యానములే లేవు. కొన్నిలఘుటీకలుమాత్రమే కలిగియున్నవి. ఇట్టి దశలో రససమన్వయము, పాత్రపోషణము మున్నగు విషయములను జర్చించి నిర్ధారణము చేయుటనావంటివాని కశక్యమేయైనను భాషాభిమానుల సౌకర్యమునకై యథాశక్తిగా వ్రాయఁబూనితిని. నా యీ గ్రంథ రచనలో నల్పభాగమైన యీ లఘువిమర్శపై సరళహృదయులైన సహృదయుల యాదరాభిమానములకై వేచియున్నాను. తమ యభిప్రాయముల నొసఁగి ప్రోత్సహించిన శ్రీ. సురవరం ప్రతాపరెడ్డిగారి యెడను, శ్రీ. సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారి యెడను గృతజ్ఞుఁడనై యున్నాను.

గ్రంథకర్త

# విషయసూచిక

# ప్రబంధ పాత్రలు

## నారదుఁడు

### ( పారిజాతాపహరణము )

కావ్యమునకు ఔచిత్యము ప్రాణమువంటిది. ఔచిత్య మనఁగా, రసము, భావము, అలంకారము, అర్థము, శబ్దము, పాత్రములు మొదలయినవి యుచితరీతినిఁ గావ్యక్షేత్రమున విలసిల్లుట. అనౌచిత్యదోషము రసభంగప్రసంగమును గల్గించును. "అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్." అనుచితమైన రసభావాది ప్రసక్తివలనఁ గావ్యము సహృదయుల బహుమానదృష్టిని నిలువఁజాలక పతనముఁ జెందును. కావుననే క్షేమేంద్రుడు కావ్యజీవితమౌచిత్యమేయని యుద్ఘోషించి, కావ్యముయొక్క సర్వావయవములయందును దానిని ఉదాహరణ ప్రత్యుదాహరణములతో సమన్వయించి చూపెను.

కావ్యమునందుపనిబద్ధమైన యితివృత్తము, ప్రవేశపెట్టఁబడిన పాత్రములు, రసాలంకారమయమైన రచన మొదలగునవి కావ్యమహత్త్వమునకుఁ గారణములు. ముక్కుతిమ్మన పారిజాతాపహరణములోని యితివృత్తము క్రొత్తది కాదు. ఈ కావ్యరచనకు హేతువు తిరుమలదేవీ కృష్ణరాయుల ప్రణయకోపనివారణమే యను పరంపరాగతమైన కింవదంతి చారిత్రకులను దృప్తిపరిచినంతగా సహృదయులను దృప్తిపరుపఁలజాదు. సహృదయులు రసతత్పరులు. వారిదృష్టిలోఁ గావ్యనిర్మాణహేతువు కావ్యఫలము రెండును భిన్నముగాక యేకమైన యానందమే. అనగా రసమే. కవి రససిద్ధుడైనప్పుడే సహృదయుఁడతనికి తన హృదయకమలమును భద్రపీఠముగా సమర్పించును.

నారదుఁడు పారిజాతాపహరణ కావ్యమునకుఁ బ్రాణమువంటివాఁడు. అతఁడులేనిచోఁ గావ్యమే లేదు. పారిజాతవృక్షమును భూలోకమునకు దింపు

టకు సత్యభామ కోంకకన్నను, నారదుని కలహప్రియత్వమే బలవత్తర కారణమని కావ్యమర్మజ్ఞులకుఁబోడకట్టకమానదు. నారదుఁడు చేయు మోస ములో శ్రీకృష్ణునికి భాగస్వామ్యము లేకపోయినను, ఆమోదము కలదు. వీరిద్దఱును గలిసి సత్యభామను వంచించినట్లు గోచరించును. కాని వీరిద్ద ఱిలో నారదుఁడు సూత్రధారి, శ్రీకృష్ణుఁడు తెటస్థుఁడు.

ఒకనాఁడు శ్రీకృష్ణుఁడు రుక్మిణీకాంత సౌధముఁలోని శశికాంత శిలా మయవేదిమీఁదఁ గూర్చొని, కొందఱు మృగాయతనేత్రలతోఁబాటు రుక్మిణితో జూదమాడుచుండగా నందఱును జకితులగునట్లాకసమునుండి యాకస్మికముగా నారదుఁడు దిగినాఁడు.

వచ్చిన నారదమునికిఁబొచ్చములేని భక్తితో హరి యెదురేగి తీసికొనివచ్చి రుక్మిణికనుసన్నలఁజెలులు పెట్టిన సింగపుంగద్దెమీఁద నాసీనునిఁజేసినాడు. మానవమాత్రుని వలె వినయమును జూపిన శ్రీకృష్ణుని నారదుఁడు "భగవంతుఁడవై యిట్లు పలుకవచ్చునా?" యని కృష్ణుని మోసమును బయల్పరచువాఁడువలె స్తోత్రమును ప్రారంభించి, యందులో ద్వారక వైకుంఠపురమనియు, రుక్మిణి లక్ష్మి యనియు నుగ్గడించి తాను నడుపఁదలఁచుకున్న కలహనాటకమునకు బీజమును నాటినాఁడు

దైవతసముఁడైన శ్రీకృష్ణుని చెంతకు రిక్తహస్తముతో వచ్చుట యుక్తముకాదను నెపమున మిన్నేఁటి పసిండినెత్తమ్మిచిగురుటాకునఁ బొదివి తెచ్చిన పారిజాతపుఁగొన్ననను శ్రీకృష్ణునికి సమర్పించినాఁడు. వినయముతో, విస్మయముతో మాధవుఁడా పారిజాతపుష్పమును దీసి కొని రుక్మిణినిఁజూచుసరికి తలఁపులో సత్యభామ యొక్కసారి మెఱుపుతీఁగ వలె మెఱిసినది. నారదుఁడు స్వయముగాఁ బారిజాతమును రుక్మిణికిచ్చి నచో నేచిక్కును లేకపోయెడిది. శ్రీకృష్ణుని చేతికిచ్చి, యతనికి లేనిపోని త్రొక్కులాటను దెచ్చిపెట్టినాడు. నారదపాత్రములోనున్న విశేషమే యిది. జగన్నాటక సూత్రధారియైన శ్రీకృష్ణునే జంత్రపుబొమ్మను జేసి యాడింపఁ బూనుకున్నాఁడు, ముఖమునకు రంగుపూసి రంగస్థలముపై

నిలువఁబెట్టినాడు. ఇక నాడక శ్రీకృష్ణునికిఁ దప్పినదికాదు. ఏమి చేయుటకును దోఁచుటలేదు. పారిజాతమును భోజాత్మజ కిచ్చినచో సాత్రాజితి కినుక వహించి యేపని యూహించునో యని భయము. సత్యభామకే పంపినచో రుక్మిణిని ఎల్లిదము చేసినట్లగునని యనుమానము. అయినను తానక్కడ నుండుటచే రుక్మిణికే యియ్యఁదలఁచినాడు. కాని నారదుని సలహానుదీసికొనుట మంచిదని, కన్నుల చిఱునవ్వుతో మునిని బ్రశ్నించి అతని కనుసంజ్ఞలతో సమాధానమును బొంది రుక్మిణి కిచ్చినాడు. ఆమె మౌనికిమ్రొక్కి యా పువ్వును దలలో దుఱుముకొన్నది. అప్పుడు రుక్మిణికిఁ గల్గిన క్రొత్తసోయగము కృష్ణునికిఁ బ్రణయాతిశయమును, సత్యభామసఖుల కసూయను, నారదమునికిఁ దన కపటనాటకమును నడుపుట కుత్సాహమును గలిగించినది. నారదుఁడు విరచింపఁదలచిన కలహప్రబంధమున కిది మొదటిఘట్టము. తనతప్పును సులభముగాఁగృష్ణునిపై నెట్టినాడు. ఇక పట్టపగ్గాలులేవని యెంచి తనకుంచెనాడించి యుపన్యాసమును బ్రారంభించినాడు.

రుక్మిణిని సంబోధించి పారిజాతప్రసూనమును పార్వతి, పద్మ, పద్మజురాణితప్ప నితరులు ధరింప నర్హలుఁగారనియు, హరిబహిఃప్రాణమ వగుటచేతనే నీకబ్బినదనియుఁ, పదియారువేవురలో నీవే ధన్యవనియుఁ బొగడిపోసినాడు. పారిజాతపుష్పము పరిమళముచెడక, వాడక, పరువము దప్పక, పరాగభరభరితమై యెల్లవేళల నీకుల్లాసముఁ గల్గించునన్నాడు. ఈ పుష్పమును వర్ణించు సందర్భమున నారదునికిఁ గల్గిన కార్యసిద్ధిజనిత గర్వము మేరలుమీరినది. కావుననే భర్తృసన్నిధిలో రతి ప్రసంగము నెత్తి దానికీపుష్పము, ఉజ్జ్వలద్వీపాంకురముగాను, శ్రమవారినిఁ దొలగించు సురటిగాను నుపయోగించునని రుక్మిణినిఁ బులకరింపఁజేయదలచినాడు. మొదటఁ దాను దలచినట్లది వైకుంఠపురము, వారు లక్ష్మీవిష్ణువులు, తాను దేవమునియైన నారదుఁడను విషయములు మరచిపోయి, కేవల నర్మసఖుఁడైన విదూషకుఁడువలె వ్యవహరించినాఁడు. "అళినీలాలక నీవునీఁతి" యని యుప్పొంగిపలికిన యాపలుకులు రుక్మిణీ

కృష్ణులుగాని, సహృదయులు గాని క్షమింపఁదగినవి కావు కాని యిప్పటికి రుక్మిణీకృష్ణులును, ఇప్పుడు మనమును "ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీన్దోః కిరణేష్వివాంకః" (చంద్రుని కిరణములయందు కళంకమువలె ననేకగుణము లుండఁ దోషము దాగిపోవుచున్నది.) అని యుపేక్షింపవలసివచ్చినది.

సత్యాసఖు లెదుటనుండుట యతని యుపన్యాసధోరణికి మరియొక దోహదము. ఈపుష్పము చలివేళల నుష్ణమును, వేసవినిఁ జలువను ఇచ్చి సౌఖ్యము నొసఁగుటయేగాక, వలసిన వస్తువులన్నిటినిఁ బ్రసాదింపఁగల దని చెప్పినాడు. అంతేకాదు సవతులు వచ్చి నీచరణ సారసయుగ్మము నాశ్రయించెదరనియు, ధవుఁడెరలేనికూర్మితో జవదాటక నీపలుకాదరించుననియు, అవిరళభోగభాగ్యమహిమాన్వితవై విహరించెద వనియు రుక్మిణినుల్లసింపఁజేసి, సత్యభామ చెలికత్తెలకుఁ గోపమును గలిగించుటకుఁ బ్రయత్నించినాడు. అంతటితో నైన విరమింపక యిన్నిదినముల నుండియు సవతులందఱిలోను హరి సత్యభామ కనుసన్నలలో మెలఁగునని చెప్పగా విన్నాముగాని నీయెడ నతనికిఁగల గౌరవమెచ్చటను లేదు. దానికి పారిజాతము నెవ్వరికినిఁ బంపక నీకిచ్చుటయే ప్రమాణమని నొక్కి చెప్పినాడు. అంతటితోఁ దన కార్యము సిద్ధించునో లేదో యని

ఉ॥ "చక్కని దానవంచు, నె జవ్వనినంచు, జగంబులోన పే
రెక్కిన దానవంచు, పతి యెంతయు నా కను రక్తుడంచు, తా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు, గణింపదు కాంతల సత్య యింతకున్
స్రుక్కక యున్నె? నీ మహిమ సూచినబోటులు విన్నవించిరన్"

అన్నాఁడు. ఇందలి సత్యాదూషణమునకు రుక్మిణి సంతసించుట కన్నను సఖులు కినుక వహించుట ముఖ్యమైన ఫలము. ఇదంతయును జూచిన బోటులు సత్యభామతో విన్నవింపవలెనని నారదుని యుద్దేశము. విన్నవించిననేగాని తన నాటకము సాగదు. ఇట్లు సత్యభామను

దూషించి, రుక్మిణిని స్తుతించి, పుష్పమునుగ్గడించిన విషయమును సఖులు సత్యభామతోఁ జెప్పనే చెప్పినారు. నారదుఁడు ప్రారంభించిన కలహనాటకము అంగప్రత్యంగపూర్ణమై రంగస్థలమున కెక్కినది. విన్నమాటల కన్నను చెప్పినమాటలు చక్కఁగా చెవి నెక్కను. కావున నొక సత్యాదాసి 'అమ్మా యేమని చెప్పుదు' నని ప్రారంభించి,

ఉ॥ "ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు ! శౌరివినంగ, రుక్మిణీ
కాంతవినంగ, నేనువినగాఁ బలికెన్ బతిగూర్చుదాన, నా
యంతటివారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీగుచున్,
వంతునవచ్చు సత్యగరు వంబికఁ జెల్లదటంచు మానినీ."

యని పూసగ్రుచ్చినట్టు చెప్పినది. ఆ రణభోజనుని మతకములు, ఆ రుక్మిణి నటనలు, ఆమురాంతకుని చేతలు దగ్గరనుండి చూచినవారి కెవరికైనను గోపముఁ గల్గించునని తన యనుభవమును దెల్పినది. నిజమే నారదమునీంద్రుఁడు క్షమింపఁ దగినవాఁడుకాఁడు. శౌరియెదుట సత్యను తూలనాడుట యెంత తప్పు ! శ్రీకృష్ణుని మాట యటుంతము. సవతియైన రుక్మిణీకాంత వినునట్లుగా పలుకుట సహింపరాని దనుటలో సందియము లేదు. పైగా సఖివినుచుండగా బలుకుటలో నతని యుద్దేశమేమి? సత్యభామకుఁ దెలిసినను భయములేదనియే కదా! తెలియవలయునని యేకదా! ఔరా ఎంతటివాఁడు నారదుఁడు ! కావుననే సఖి "ఎంతకులేఁడు నారద మునీంద్రుడు" అని తిట్టిపోసినది:

కఠోరములైన యీ మాటలు వినువరకు వ్రేటుదిన్న సర్పాంగన వలెను, నేయిపోయ భగ్గుమను హుతాశనకీల వలెను సత్యభామ మండి పడినది. ఇంకేమి నారదుని యత్నము కార్యరూపమును దాల్చినది. కలహాశనుఁడు తానై వచ్చి యింతపని జేసెఁగా యని సత్యభామకు పట్టరాని కోపము వచ్చినది. ఒక పువ్వును దెచ్చి, అది యతులమహానుభావమని యచ్యుతునికిఁ దా నిచ్చుటయు, నతడు ప్రియమున్నచోట నిచ్చుటయు జరిగిన జరిగెగాక; ఆమతకరి వేలుపుఁదపసి యచ్చట మమ్మ్మ

దలఁప నేల?' యని తలఁచినది, తృణీకారభావమును ఈర్ష్యను సత్య వెల్లడి చినది. కాని యంతటితోఁ దన్తృప్తిపడి యూరకుండుటకు వీలులేదు. విసపు వలెఁ బ్రాకిపోవుచున్న యవమాన మామెను పెక్కు బాధలఁ బెట్టినది. నారదునిపై నంతకోపము వచ్చినను,

కం॥ "మునియేమి సేయు? రుక్మిణిఁ
గొనఁగారణమేమి? ధూర్త గోపాలుఁడు చే
సిన చెయ్దమేమి సెప్పుదు
మనమెఱియదె? ప్రాణమైన మగఁడిట్లయినన్"

అని కృష్ణునిమీదనే తప్పు మోపినది. నారదుఁడు కోరిన కోఁ కయుఁ పన్నిన పన్నుగడయు నిదియే. అదిసిద్ధించినది. ప్రాణమైన మగఁ చేత లిట్లు విరుద్ధముగా స్పష్టమైనప్పుడు మానవతియు, స్వాధీనపతిక నఁ తలచునదియు నైన సత్యభామ యెట్లు సహింపఁగలదు? సహింపలేక యే గాఢమనోజ విషాద వేదనలోఁ బొరలినది. చివరకు సఖులయెదుటనైనను నిలువలేక, చీకటింటిలో చేరి ముసుగుపెట్టి పండుకున్నది.

ఇంత యనర్థమును దెచ్చిపెట్టియు నారదుఁ డెరుగనివానివలె కాలు గదల్పక రుక్మిణీ కృష్ణుల దగ్గరనే తిష్ఠ వేసికొని కూర్చున్నాఁడు. కాని శ్రీకృష్ణునికి మాత్రము చిత్తము స్వాయత్త మగుటలేదు. ఇంకలా భము లేదు? ఈ మొండిచుట్టము విడువడని పరిద్యాముపని వానిదగ్గర నుంచి తాను రథము నెక్కి కేతన పటాంచల చంచలమైన చాల్మితోను, బండికండ్లవలె భ్రమించుచున్న మనస్సుతోను సత్య సముదంచిత కాం చన సౌధవీధికి వెళ్ళిపోయినాడు. నారదునికిఁ గర్తవ్యము పూర్తిగాక పోవుటచే నచ్చటనే నిలిచినాడు.

శ్రీకృష్ణుఁడు, అలబలము లేని సత్యభామనగరునఁ బ్రవేశించి, యామెను పాదాభివందన పర్యంతమైన సాంత్వనముతోఁ గలక దేర్చు టకి నతనికిఁగలిగిన శ్రమకుఁ బరిమితిలేదు. ఆ సందర్భమున సత్యభామయే తనను రాలనిపించుకొన్నది. ఎట్లో యామెను బ్రసన్నురాలినిఁ జేసికొని,

నారదుఁడు వేసిన యుచ్చులోనుండి తప్పించుకొన్నాఁడు. కాని పారిజాత వృక్షమునకై యమరులతోఁ బోరవలసిన వాఁడగుటచే మఱియొక భోజనలాభమును గలహాశనునకుఁ గల్పింపక తప్పినదికాదు. కలఁక దేరిన సత్యభామ, కాంతా ప్రణయసుధ ననుభవించుకృష్ణుఁడు మోదమున నుండు నంతలో రుక్మిణి యింటినుండి నారదమునీంద్రుఁడు మరలఁ బ్రత్యక్షమైనాఁడు. ఇఁకనేమి? కంసద్వేషి పంక్తిలో, గారుత్మత పాత్రికలలో భోజనము. సత్యభామయు, ఆమెచెలులును వడ్డించువారు. రుచులను జెప్పుకొనుచు భోజనమునుసాగించినారు. భోజనానంతరమున సౌధోపరిస్థమైన చంద్రశాలలో నారదకృష్ణులు కూర్చొని యుండగా సత్యభామవచ్చి నారదునికి నమస్కరించినది. దేవమునికి మంచి యవకాశము చిక్కినది. సత్యభామకుఁ దనపైనున్న కోపమును దొలగించుటకును, భవిష్యత్కార్య పరిణాళికను వేయుటకును నిదియే మంచి యదను. చాటున దూషించి యపకారముఁ జేయుచున్నను, నెదుట మాటల తీపితో రంజింపఁ జేయఁగల వారిలో నారదుఁడు అగ్రగణ్యుఁడు. అట్టివారి యెదుట భావగోపనము లేని యమాయికులు లొంగిపోవుట సహజము. ఇచ్చట నారదుఁడు ప్రదర్శించిన చాతుర్యమట్టిదే. సత్యభామను జూచి యేమనుచున్నాఁడో చూడుఁడు.

మ॥ "పతినీవై విహరింపఁగా, జనము సంభావింపఁగా బంధుసం
తతి నిష్ఠం గొనియాడఁగా, సవతి కాంతల్ సూచి లజ్జింపగాఁ
నతుల ప్రాభవ వైభవోన్నతుల ప్రోవై యిట్లు వర్తించునీ
కితర స్త్రీజన బుద్ధి దీవనలు నే నేమిచ్చెదన్ మానినీ !"

అన్నాఁడు రుక్మిణికి వశంవదుఁడైన కృష్ణుఁడు, సత్యభామతో నభేదభావమును పొందుచున్నాడని పూర్వాపర విరోధమును సవరించుకొనుటకై చదువరులు పాటుపడ రాదు. అది కవి యుద్దేశము గాని, నారదుని యుద్దేశముగాని కాదు. అప్పటిమాట యప్పుడే ఇప్పటిమాట యిప్పుడే. ఎవరోటి దగ్గర నావదము అదే నారదుని స్వభావము. అదియే

నారదునిలో నున్న గడుసుఁదనము. శ్రీకృష్ణుఁడును మనవలెనే యీ మాటను విన్నాడు! ఈ మాటను విన్నాడు! అయిన నేమి? నారదుని యెత్తున జరుగుచున్న సత్యావంచన నాటకములో నతనికిఁ గొంత భాగస్వామ్యమో, ఏమగునో చూతమన్న తటస్థభావమో యున్నది. అందువలన నూరకున్నాడు. నారదుఁడంతటితో నాగువాఁడా? కాదు ఇంకను నేమనుచున్నాడో చూడుడు!

మ॥ "అనిశైనం బతి నిన్ను బాసిచనునో, ప్రాణంబు పాణింబుగా
నిను మన్నింపఁడొ, నీమనో రథములన్ నెయ్యంబుతోఁ జేయఁడో,
చనవుల్ నీవలె నెవ్వరే గనిరొ, నీ సౌభాగ్యమింతంతయే?
నిను బోలంగల రజ్జగంధులన వింటే? యెందు సాత్రాజితీ!"

అన్నాఁడు. రాబోవు స్వర్గయుద్ధమునకు సత్యభామను దీసికొని పోవలయునని కృష్ణునికి సూచన, ఆతఁడంగీకరింపని పక్షమునఁ బట్టుపట్టుమని సత్యభామకుఁ బ్రోత్సాహము. నీతో నే యజ్జముఖులును బోలరనుట తన మీఁది యపనిందను దొలగించుకొనుట. ఈ మొదలయిన పెక్కు భావములు మనసున నిడుకొని యట్లుదీవించినాడు. దీనితో నతఁడు తలపెట్టిన దేవయుద్ధము జరిగితీరును. అందువలనఁ దృప్తుఁడై, అమ్మా! నీ భర్త నీవు కోరిన కోర్కెయెంతటి దయినను తప్పక తీర్చుగాక యని యాశీర్వదించి, కృష్ణా! నన్ను మరువవద్దని చెప్పి వెళ్ళిపోయినాడు. కృష్ణుఁడు మరచుట యేమి? మరువవద్దని నారదుఁడు చెప్పుటయెందులకు? దానిలో నేదో కిటుకున్నది. అతని నాటక మింకను ముగియ లేదన్నమాట.

శ్రీకృష్ణుఁడు సత్యభామతోఁ గలిసి స్వర్గమును జేరినాఁడు. ఇంద్రాది దేవతలు గౌరవించి వైజయంత ప్రాసాదములో విడిదిఁ గూర్చినారు. చుట్టపు చూపుగా వెళ్ళి స్వర్గోపభోగము లనుభవించిన కృష్ణుఁడు వంచనతోఁ బారిజాతమును దేఁబూనుట గమనింపఁదగిన విషయము. మొదటనే యుద్ధమును బ్రకటించినచో సత్యభామకు నందనవన సౌందర్యమునుజూపుటకును, స్వర్గసుఖముల ననుభవింపఁజేయుటకును నవకాశము చిక్కదు.

శచీదేవికిఁ బ్రాణతుల్యమైన పారిజాతవృక్షమును దెచ్చుట సామదానము లతో సాధ్యమగుపనికాదు. కావునవంచనముతో వృక్షమును బెకలించు టయు, దండముతో రక్షించుకొని తెచ్చుటయు విధిగా శ్రీకృష్ణుని కర్తవ్యము లయినవి. ఈ మహాకార్యసాధనము వల్ల సత్యభామకు పూర్తిగా ననుమానము పోయి, శ్రీకృష్ణుడు తనకు వశంవదుడన్న నమ్మకము కుదిరినది. పారిజాత వృక్షమును దెచ్చి పెరటి చెట్టుగా నాటు కున్నారు.

నారదుఁడు మరలఁ బ్రత్యక్షమైనాడు ఈ తడవ యింకను నధికముగా శ్లాఘించినాడు. సవతులనే కాదు త్రిభువనేశ్వరియైన శచీదేవిని గెలిచితి వన్నాడు. ఈ పారిజాత ప్రతిష్ఠకు అంగముగా పుణ్యక వ్రతము చేయ వలయు నని, ఆ వ్రత విధానమును జెప్పి, వ్రతమును జేయించి, వ్రతాం గముగాఁ బతిదానమును దానే గ్రహించినాడు. ఇప్పుడు శ్రీకృష్ణుడు పూర్తిగా నారదుని చేతిలోని కీలుబొమ్మయైపోయినాడు. కనుకనే,

సీ॥ "మేళవించినవిసుమ్మీ దీనిమెట్లని
మాంసలాంసంబున మహతిఁ జేర్చి,
మిన్నేటిజలముసుమ్మీ తోలంకెదునని
డాచేత మణికమండలువొసంగి,
ఇదిజపోచితముసుమ్మీ జతనంబని
వలచేతఁ బద్మాక్షవలయమిచ్చి,
ఈశానుడిచ్చెసుమ్మీ మాకునిదియని
శార్దూలచర్మంబు చంకఁజొనిపి,

తే॥ పొమ్మపొమ్మని యొకకొంత పోవఁబోవ
రమ్మరమ్మని మరలఁ జేరంగఁబిలిచి
కపటనటనాపరుండైన కంసవైరిఁ
బరమముని నవ్వుటాలకుఁ బనులుగొనియె."

ఈ విధముగా భార్య యెదుట కృష్ణునితోఁ బనులు చేయింపించినాడు. ఇట్లు తనకు స్వాధీనుడైన భక్తపరాధీనుని మరలఁ గొంత ద్రవ్యము పుచ్చుకొని సత్యభామకిచ్చి, పుణ్యకవ్రతముతో సత్యభామ గర్వమును బూర్తిగాఁ దుడిచి వేసినాడు, వ్రతముకోసరమై పదియాఱు వేవురు సవతుల యిండ్లకుఁ బోవలసినదయ్యెను. తనకు స్వాధీనుడైన కృష్ణుని నారదునికి స్వాధీనునిఁ జేయవలసివచ్చెను. వ్రతము ముగిసిన పిమ్మట రుక్మిణీప్రభృతులను గౌరవింపవలసెను. ఇంతకన్నను స్వాధీనపతికనని గర్వపడుచున్న సత్యభామకు గర్వశాంతి యేమి కావలయును! ఇదంతయు నారదుఁడు వేసిన యెత్తు. నారదుఁడు నడిపిన నాటకము. ఇట్లు తన వచ్చిన పనిని ముగించుకొని నారదుఁడు వెళ్ళిపోయినాఁడు.

ఈ విధముగా పారిజాతాపహరణము నందలి ప్రధానరసమైన శృంగారమునకు హాస్యరసప్రాయుడై, నారదుఁడు తుదివరకును దోడ్పడెను నారద పాత్రములోని సమయజ్ఞత, ఉక్తిచాతుర్యము, నూతన సంఘటనలను సృజించుశక్తి, మొదలయిన గుణములు వర్ణనాతీతములు. కావున పారిజాతాపహరణ కావ్యమున నారదుఁడు ప్రముఖ పాత్రము. నాయికానాయకులయిన సత్యా కృష్ణులకు, శాకుంతలాది సంస్కృత నాటకములలో విదూషకుడువలె నుపయోగించెను. నారదుడు లేనిది రసము లేదు కావ్యము లేదు. శ్రీకృష్ణుఁడతని కధీనుఁడు. ఇట్లు కవి పారిజాతాపహరణ కావ్యమునందలి నారదపాత్ర రచనమున ఔచిత్యమును చక్కఁగా పోషించి నాడు. ఒక్క 'అళినీలాలక' అను పద్యమును వదలినచో నారదపాత్రమున ననౌచిత్యము కానరాదు. స్వభావము, నడవడి, ఉపాయములు, ఎత్తులు, కార్యసాధనము మొదలయిన గుణములు స్ఫురించుటయేగాక నారదునికి సహజమైన భక్తిభావమునకును గౌరత గలుగలేదు. ఆదిమధ్యావసానములలోను తనభక్తిపరాయణత్వమును వెల్లడించుటయే గాక, పుణ్యకవ్రతమువలన శ్రీకృష్ణుఁడు భక్తపరాధీనుఁడను విషయమును సయితము స్పష్టపరచినాఁడు. 'అళినీలాలక' పద్యముగూడ నెదుటనున్న రుక్మిణికోసముకాక, సత్యభామ కసూయను పెంపొందించు

టకే యనిగాని, రసపరాకాష్ఠలో లౌకికములైన యశ్లీలములు స్ఫు
పవనికాని సరిపుచ్చుకొన్నచో, నింకయే యనౌచిత్యమును నా
పాత్రరచనలోఁ గన్పట్టదు. ప్రాచీనకవు లందరును సంభోగ శృం
రమును ఉన్నతస్థాయిలో వర్ణించినవారే. కనుక తిమ్మకవి నారదప
చిత్రణము సమగ్రము, సముచిత సంఘటనా శోభితము నని గ
సింతము.



# ప్రబంధ పాత్రలు



## మాయాప్రవరుడు

(మనుచరిత్రము)

ప్రతిభావంతుఁడైన కవి కథాసూత్రము ననుసరించి కావ్యము నందలి ప్రతి పాత్రమునందును శిల్పమును బ్రదర్శించును, కాని యే ఒక్క పాత్రములోనో అఘటన ఘటనా ధురీణమైన యతని శిల్పచాతురి సహృదయ హృదయ కమలములకు బాలభాస్కర ప్రతిమానమై గోచరించును. పఠితల భావప్రపంచము నుద్రేకింపఁజేసి, వారి యనుభవములను దర్పణమునవలె సాక్షాత్కరింపఁజేయు పాత్రచిత్రణమే రససిద్ధికి జీవగఱ్ఱ,

ఆంధ్ర ప్రబంధ రచయితలలో అల్లసానిపెద్దన ప్రతిభావంతుఁడు. శుష్కమైన పౌరాణిక గాథకు రసమయత్వమును జేకూర్చి, కవితారస సిద్ధుఁడై కవులలో పెద్ద యనిపించుకున్నాఁడు. ప్రవర వరూథినీ పాత్ర చిత్రణమున నతఁడు చూపిన శిల్పచాతురి యసాధారణమని రసజ్ఞలోకమునకుఁ గ్రొత్తగాఁ జెప్పవలసిన పనిలేదు. అట్లే ఇతర పాత్రములందును దన కళాచాతురిని ప్రదర్శించినాడు. కథాసూత్రము సాగుటకు ముఖ్య పాత్రములే యాధారము లైనను, మృచ్ఛకటికమున శకారుని వలెను, పారిజాతాపహరణమున నారదుని వలెను, ప్రభావతీ ప్రద్యుమ్నమున శుచిముఖి వలెను, ముఖ్యాతి ముఖ్యములై కొన్ని

పాత్రలు హారమునకు నాయకమణివలెఁ గాక పోయినను, కొలికిపూస వలె సహాకరించుచుండును. అట్టి పాత్రముల మీఁదనే కావ్యసంపద యంతయును నాధారపడి యుండును. మనుచరిత్ర పాత్రములలో మాయాప్రవరుఁడు అట్టి తరగతికిఁ జెందినవాడు.

మనుచరిత్రమను పేరు లోకవ్యవహారములోనికి వచ్చుటకు "మనుచరిత్రం బందుకొను వేళఁ బురమేగఁ బల్లకిఁ దనకేలఁ బట్టియెత్తె" నను పెద్దన పద్యమే కారణమై యుండవచ్చును. నిజమున కది 'స్వారోచిష మనుసంభవము' గాని 'మనుచరిత్ర' గాదు. మనువుయొక్క సంభవమునకుఁ బూర్వపీఠికగా నున్న కథాభాగమే కావ్యమున నధిక భాగ మాక్రమించినదికాని మనువుయొక్క చరిత్ర మంతగా వర్ణింపఁ బడలేదు. సంభవహేతువునందు పవిత్రత, అలోకసామాన్యత మున్నగు గుణములు నిబద్ధములై యున్నచో చాలునని పెద్దన భావము. కుమారసంభవమును రచించుసందర్భమున కాళిదాసును నిదేమార్గము నవలంబించెను. కాళిదాసుని కుమారసంభవము పెద్దన స్వారోచిష మనుసంభవమున కొరవడి యగునేమో సహృదయులు నిర్ణయించుకొందురు గాక. కుమారసంభవము షణ్ముఖుని జన్మమున కుద్దేశింపఁబడినను, పార్వతీ పరిణయ పూర్వభావియైన కథాంశమందుఁ జొచ్చినట్లే, స్వారోచిష మనువు పుట్టుక కుద్దేశింపఁ బడిన మనుచరిత్రయందును ప్రవర, వరూధినీ, స్వరోచి వృత్తాంతములు ప్రవేశించినవి.

కొందఱు విమర్శకులు మనుచరిత్రయందు వస్త్వైక్యము లేదని విమర్శించుచు, నెచ్చటనో మొదలిడి యెచ్చటనో ముగింపఁబడిన రఘువంశాది శ్రవ్యకావ్యములయందు వస్త్వైక్యము లేకపోవుట కనఁబడును గనుక నది దోషము గాదని తృప్తి పడిరి. (రఘువంశము దిలీపుని చరిత్రముతో నారంభింపఁబడి అగ్నిమిత్రుని కథతో ముగింపబడుచున్నది.)

వీరి మతమున వస్తువనఁగా గ్రంథప్రతిపాద్యమైన కథాంశము ఏకనాయకముగా నుండుటయని తేలుచున్నది. వస్తువనఁగా నేకనాయక

కథాంశమను నియమ మున్నట్లు స్ఫురించుటలేదు. ఆలంకారికులు వస్తువును 'ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము' అని విభజించిరేకాని అది యేకనాయకముగాఁగాని,ఏక రసాశ్రయముగాఁగాని యుండ వలయునని నియమించినట్లు కనఁబడదు. అట్టినియమము నంగీకరించినచో నాటకములు, కొన్ని కావ్యములు మాత్రమే కావ్యములని చెప్పదగి యుండును, రఘువంశము, కుమార సంభవము, కళాపూర్ణోదయము మొదలగునవి కావ్య కక్ష్యనుండి తొలగ వలసి వచ్చును. కనుక "వస్త్వైక్యము అను లక్షణ విరుద్ధ పదమును సృజించుకొని, భిన్న రసాశ్రయములు, బహునాయకములు నైన రసవత్కావ్యములను దోషయుక్తములని శంకించి విచారపడుట నిరుపయోగము, వస్త్వైక్యమనునది (Unity of the plot) ఆంగ్ల సంప్రదాయము.

వస్తువు కవి యుద్దేశానుసారముగా నుండును. కావ్య ప్రతిపాద్యమే (కావ్యమునఁ జెప్పఁదలచినది) వస్తువు. ఆవస్తువు వివిధ రసాశ్రయమై బహుళ కథాంశములతో నుండవచ్చును. అనేక రసములను దనలో పర్యవసింపఁజేసి కొనవచ్చును. షణ్ముఖుని యుత్పత్తి లోకమున కెంత యవసరమో, ఎట్టి పవిత్ర ప్రేమగల దంపతులనుండి యుతఁ డుద్భవించెనో కుమారసంభవ పూర్వభాగ కథ తెలుపుచున్నది. రఘువంశ కావ్యమున వంశ చరిత్రయే వస్తువు, ఆవస్తువు విభిన్న రసాశ్రయము లయిన కథాంశములతో రత్నహారము వలెఁ బ్రకాశించుచున్నది. రత్నముల ప్రత్యేకత హారమునందువలె నానారాజుల వృత్తాంతములు రఘువంశ కథనమునందే పర్యవసించు చున్నవి. ఇట్టి కావ్యములందు వస్త్వైక్యము లేదనుటలోఁ గల విశేషమేమి? ఇక నేక రసాశ్రయముగానున్న వస్తువే కావ్యమున కలంకార ప్రాయముగా నుండుననియు, సమ ప్రాధాన్యముగల భిన్నరసము లొక్క కావ్యమున భాసింపరాదనియుఁ దలంతు రేని నది కొంత యుక్తియుక్తముగా నుండును. కాని అప్పుడు ప్రతిపాద్యమును జాగ్రత్తగా నిర్ణయించు కొనవలసి యుండును. సామాన్య లోకము వీరరస ప్రధానమనియు, ధర్మశాస్త్ర రూపమనియు భావించు

చున్న మహాభారతము శాంత రసాశ్రియ మనియు, యుద్ధానంతర మున ధర్మజాదులకుఁ గలిగిన సంసారాసారభావనా రూపమగు నిర్వేదము స్థాయి యనియు ధ్వన్యాలోకమున ఆనందవర్ధనుఁడు చెప్పియున్నాఁడు. అట్లే ప్రతిగ్రంథమునను, ప్రధానాంశ మొక్కటియే యుండి, ఇతర విషయము లన్నియు నందులోనే పర్యవసించును గనుక మహాకావ్య ములలో వస్త్వైక్యము లేదనుమాట పొసఁగనేరదు. మనుచరిత్రయందు వస్త్వైక్యము లేదనుమాట అంతగాఁ జాటింపఁ దగినదిగాదు. వరూధినీ ప్రవరుల వృత్తాంతము స్వారోచిష మనువుయొక్క జన్మమహాత్త్వము నందు పర్యవసించును.

వరూధినీ ప్రవరుల వృత్తాంతమున వెల్లి విరిసిన రసమును రాబోవు కథాంశమున కుపకరింపఁ జేయు పిల్లకాలువ వంటివాఁడే మాయా ప్రవ రుఁడు. ఇతఁడు లేకపోయినచో, మనుచరిత్ర రెండవ యాశ్వాసము వరకే ముగిసి మనుజన్మ ప్రకారమున కాస్కారము లేకపోయెడిది. కవి సత్య ప్రవరునిఁ జిత్రించుటయందుఁ జూపిన శ్రద్ధను మాయా ప్రవ రునిజిత్రించుట యందునుఁ గుంటుపడనీయలేదు. అతనిలోఁగల విశేషము లన్నింటిని ఇతనియందు ప్రతిబింబింపఁ జేసెను. గంధర్వుఁడు ప్రవరుని ప్రతిరూపముగా నచ్చుపోయఁబడిన వ్యక్తి. యదార్థరూపముకంటెను కొందరి చిత్రగతరూపమే యందముగా నుండును. అట్లే మాయాప్రవ రుని వైదిక నటనలు సత్యప్రవరుని శ్రోత్రియత్వమును మించిపోయినవి. మాయాప్రవరుని పాత్రము మన హృదయ గోచర మైనప్పుడతఁడు మాయావియైన గంధర్వుడని తలచి యేవగించుకొనుటకు బదు లతని చాకచక్యమువలన వరూధిని వలెనే మనమును ముగ్ధులమై తన్మయత్వము నొందుట జరుగును. ఈ యనుభవము మనుచరిత్రను జదివిన రసజ్ఞులకుఁ గ్రొత్తదిగాదు.

ప్రవర వియోగ దూయమాన మానసయైన వరూధిని తోడిచెలి కత్తెలు నీరాడ రమ్మన్నను వారికి నమస్కరించి, సరస్తీరమున ఖిన్న

రాలై కూర్చున్న యదనుఁగనిపట్టి, దుమారమువలె నాకసముగప్పుపుప్పొళ్ళలో మాయా ప్రవరుడు ప్రత్యక్షమైనాఁడు. ప్రత్యక్షమై సత్యప్రవరునివలె మోడువారి నిలుచుండలేదు. పసిడితోరముతో ముద్దులొలుకుచున్న బాహువునెత్తి మాటిమాటికినిఁ బూజా పుష్పముల కోసమన్నట్లు పొదల మీదికి చాచుచున్నాఁడు. పెదవి కదలునట్లు మెల్లగా వీణామధుర స్వరముతో జటలు చెప్పుచున్నాఁడు. త్రోవలు వెదకు చుప్పనాతితనముగల దీర్ఘలోచన దీప్తులతో దిశలకు తోరణములు కట్టుచున్నాడు. మేని బంగారుపునీరుతో నారామరంగము నలుకుచున్నాఁడు. నల్లనిశిరోజముల కాంతుల నచటి భృంగములకు వడ్డికొనగుచు నొక్కసారి మరల వరూథిని హృదయమును జల్లుమనిపించినాడు. వైదిక చేష్టలలో నింత మాధుర్యమును జూపుశక్తి వలయునన్నను సత్య ప్రవరునికబ్బుట దుర్లభము. కనుకనే వరూథిని వయస్యలను విడిచి, యతని సన్నిధికేగి కలనుగాంచిన వస్తువును జాగృతిలోఁగన్నంత యనురక్తితోఁ గాంచుచు నిలుచున్నది.

తన దర్శనమువలన వరూథినికి గుండెజల్లుమన, కాళ్ళుతొట్రుపడి మొగము చిన్నవోయి, కనులు చెదరి, కటకటా! యనుటలో గద్గద స్వరము కలిగి, మైచెమర్చి కన్నీరు వొడముటను ధైర్యముతోఁ జూచుచు నిలుచున్న మాయాప్రవరుని గడుసుఁదనము మెచ్చఁదగియున్నది. పూర్వ పరిచయమేగాక వాదోపవాదములు చేసిన వ్యక్తియేకావున వరూథిని మరియొక్కసారి నిక్కమైన తన ప్రేమను స్పష్టపరిచినది. ముందే విసిగి యున్నది గనుక తమకమును బట్టఁజాలక,

శా॥ "రా వైరాగ్యముఁ బూని నీవు కడు నిర్దాక్షిణ్య చిత్తంబునన్
రావై తేఁ జవిగాని యిందులకు హోరాహోరిగా పోరి యే
లా వాలాయము సేయఁగాఁ బ్రదుకు నీవాచారవంతుండవై
చావో యెక్కడొ నీయెడన్ బొడము వాంఛన్ భూసుర గ్రామణీ"

అని నిరాశతో నిష్ఠురము లాడినది. కట్టఁడితమున కొడిఁగట్టి,

మనసు రాయిచేసి కరుగని నిన్ననుటయేల? నాయదృష్ట మిట్లున్నదని దైన్యము చూపి యూరకున్నది.

మాయాప్రవరునికిది మంచి యదను. అంతగా వైముఖ్యము చూపిన ప్రవరుఁడొక్కసారి సరేయని యొప్పుకొనుట ప్రమాదము గనుక తన యిబ్బందులను ముందుగా జెప్పుకొన వలెను. ఆ చెప్పుకొనుటలోఁ దనరసికత్వము బయలుపడుటయుఁ బ్రమాదమే. అందుకని కామినీ గోష్ఠిలోఁ బ్రౌఢములైన తనయాదుటుచూపులను ఱెప్పతుదలతో మరగు పరచుకొన్నాఁడు. ఆనందమునఁ బొంగివచ్చు చిఱునవ్వును మొగముపైఁ గన్పడనీక డిందు పరచుకొన్నాఁడు. ఉబికిపోవుచున్న మేని శృంగార చేష్టలను తెచ్చికోలు మౌగ్ధ్యముతో దాచుకున్నాఁడు. ఉప్పొంగి రసావేశమున వచ్చు నర్మోక్తులను నాలుకకు రాకుండ గుప్రిక్కుకొన్నాఁడు. తలవంచి యుసురని మౌనముద్రతో నేలను బొట్టన వ్రేలితో వ్రాయుచు నిలిచి, కొంతసేపు లేనిచింతను నటించి, శిరసును కొంచముగా నెత్తి సన్నని మెలుగుతో బలికినాఁడు. పితృభక్తియందును, వైదిక ధర్మనిష్ఠ యందును, గార్హస్థ్యమునందును సత్యప్రవరునికిఁ దీసిపోని విధమున నేమనుచున్నాఁడో చూడుఁడు!

శా॥ "తల్లిందండ్రియు నన్నుగానని మనస్తాపంబునం బొక్కఁగా
నిల్లాలార్తిఁ గృశింపఁగా సవనవహ్నిశ్రేణి చల్లారఁగా.
నిల్లుం శూన్యత నొంది సొంపుచెడఁగా నిచ్చోట నేఁజిక్కి యో
ఫుల్లాంభోరుహనేత్ర యే సుఖమతిం భోగించెదం జెప్పవే."

అని గార్హస్థ్యమునందలి బాధ్యత తాత్కాలికమైన వరూథినీ సంబంధము కన్న బలీయమగుటచేతనే తనకీ త్రొక్కులాట తటస్థించినట్లు సూచించి నాఁడు: రంభాదులలో నొక్కతెయై, కన్నెఱికము చెడని వరూథిని యింతగాఁ బ్రేమించినప్పుడు విరసమైన వైముఖ్యమును జూపుట తనకు రసికత్వము లేక కాదు, ఇదమిత్థమని నిర్ణయించుకోరాని తన పరిస్థితియే కారణమని వరూథిని గ్రహించుటకై,

ఉ॥ "ఓసరసీరుహాక్షి వినవో రతిఁగౌఁగిట నీవు చేర్చువిం
పానురభర్తకైన గలదా? వలదంచుఁ బెనంగ నేను స
న్యాసినె? యొక్కటే తహతహల్ మనసొగ్గదు కేళిపై 'ననా
శ్వాసిత దుఃఖితే మనసి సర్వమసహ్య'మనా నెఱుంగవే."

అని ఆసన్నని యెలుగుతోనే తానింతకుముందు నిరాకరించి నందులకు క్షమాపణము, సురభర్తకును దుర్లభవని వరూథిని కన్యాత్వ ప్రశంసయు, తన భోగలాలసయు, తనమనస్సులో తీరని సంశయము చింతయు నుండుట చేతనే కేళిపై మనసొగ్గుట లేదుగాని తాను సుముఖుఁడనే యను మొదలయిన భావములను స్ఫురింపఁజేసినాడు. కొండ నెక్కి కూర్చున్న ప్రవరుని తత్త్వమును మాయాప్రవరునిద్వారా యింత నెమ్మదిగా క్రిందికి దింపినట్లు స్ఫురింపఁజేసిన ఆంధ్రకవితా పితామహుని శిల్పము వర్ణనాతీతము.

ఇంత పెనుగులాట జరిగి, ఇన్ని వాదోపవాదములు చెలరేగి, న్యాయనిష్ఠురముల పాలైన తనకు, ఒక తరుణిని ఒక అనన్య కాంతను వంచించుట ధర్మము గాదు గనుక "ఐనఁ గానిమ్ము భవద్దీనతకై వ్రతము విడిచితిఁ" అన్నాడు. ధార్మికుఁడు ప్రతి కార్యమునందును ధర్మమునే యుపలక్షించును. గనుక "పరులకు మేలయినఁ జాలు శరీరం బైన నుపేక్షింప వలయు" నని తన స్వార్థ త్యాగమును జూపినాఁడు. ఈ మాటలతో ప్రవరుని మనస్తత్త్వమునుండి పూర్తిగా క్రిందికి దిగు పని గంధర్వునికి నెరవేరినది. ఇక తన మోసమును బయల్పడ నీయరాదు. అందుకని సంభోగ సమయమందలి తమ దేశాచారమును దెలిపి తానై విడుచు వఱకుఁ దనను విడువకుండవలయుననియు, లేనిచోఁ దాను రెంటికిఁ జెడిన రేవడ నగుదు ననియు నచ్చఁజెప్పి, "ఇంత యేమిటికిం దేనిఁ జెప్పెద నేను వైదేశికుండ బంధుమిత్ర కళత్రంబులఁ బాసి దైవయోగంబున నింతదూరం బేగుదెంచినవాఁడ, మీద భవదర్థంబు ప్రార్థితుండనై వ్రతహోమాద్యనుష్ఠానంబులు విడువంగలవాఁడ నగుటం జేసి యంతరంగంబునం గల తెఱంగు తేటపడం బలుక వలసె" నని యుపన్యా

సము కొట్టి యామెచే "నానోముల్ ఫలియించె, నావయసు ధన్యం బయ్యె విప్రోత్తమా" యనిపించుకొన్నాడు. దానిలో వరూధినికిఁ బ్రవరుని ప్రథమ దర్శన సమయమున నంకురించిన రతిభావము పల్లవితత్వ కుసుమితత్వ, ఫలితత్వ దశలను పొంది పూర్ణమైన అద్వయానందమును ప్రసాదించినది. ప్రవర గంధర్వుల భేదము నెఱుఁగని వరూధిని రతి భావము పరాకాష్ఠను జెంది, బ్రహ్మ తేజోమయమైన గర్భమునకు దోహదము నొసగినది. అట్టి తేజస్సు సంక్రమించిననే గాని పుట్టబోవు స్వారోచికి దైవ మానవ తత్వ సమ్మేళనముగల మనువును గనుట కర్హత గలుగదు. స్వారోచిష మనువు వంశక్రమాగతమైన దైవ మానవ తత్వములు గలవాడని తెలుపుటకే పురాణకర్తలు మను చరిత్రకుఁ బ్రవర చరిత్రమును జతపరిచిరి. పురాణములను ఆంధ్రలోక మున కందింపఁ దలచిన మారనయు యథోచిత కవితా శిల్పముతో నాయాపాత్రల వర్ణించి, స్వారోచిష మనుసంభవ ప్రకారమును దెలుగు వారికిఁ దెల్పెను. పట్టినది బంగారముచేయు కవితారసము ఆంధ్ర కవితా పితామహుని హస్తములో నున్నది. ఆకథనే స్వీకరించి యనేక మనస్తత్వములను, వివిధ రసములను, వివిధ భావములను స్ఫురింపఁ జేసి సహజమైన తనయుల్లిక జిగిబిగితో నాంధ్ర సర్వతికి ఒక యమూల్యమైన యాభరణమును సమర్పించినాడు. వంశ సమున్నతికి నిర్మలమైన స్త్రీహృదయము ముఖ్యాధారమను భావమును, లోకానుభవమును చిత్రించిన పెద్దన ప్రతిభ అనితర దుర్లభమైట్టినది.

కొందఱు లాక్షణికులు "ఏకత్రైవానురాగశ్చేత్ తిర్యఙ్ మ్లేచ్ఛగతోపివా, యోషితో బహుసక్తిశ్చేత్ రసాభాసః త్రిధామతః" అను ప్రమాణము నాధారముగాఁ గొని, ప్రవర వరూధినీ శృంగారమునందలి రతిభావ మొక్క వరూధినిలోనే యున్నది కావున 'ఏకత్రైవానురాగశ్చేత్' అను మాట ప్రకారము ఇది రసాభాస మనుచున్నారు స్థూలముగా నిది సరిపోవు చున్నది. కాని ఏకత్ర కలిగిన యనురాగము నిష్ఫలమైనచో రసాభాసమా? సఫలమైనను రసాభాసమేనా? యని ప్రశ్నించి. కొందుమేని సమాధానము చెప్పుట కష్టమగును. బలవద్గము

నాదులు రసకక్ష్యకే చెందవుగనుక వాటికి రసాభాసత్వమును సిద్ధింపదు. [రసాభాసమనగా రసమువలె భాసించి ఆనందము నొసఁగునది యని యర్థము. కొందఱు తలచునట్లు అసహ్యమని యర్థముకాదు.) కనుక పరస్పరము నుదయించిన రతిభావము ఫలించుట రసము. ప్రేమించిన వ్యక్తి సమ్మతింపక తానే పెనుగులాడుచున్నట్లు స్ఫురించుట రసాభాసము. వరూధినిరతిభావము సత్యప్రవరునియెదుట రసాభాసముగా పరిణమించునంత దశకు వచ్చినమాట సత్యము. కాని గంధర్వుని సాక్షాత్కారముతో వెనుకటిదంతయు తారుమారైనది. (చక్షుః ప్రీతి, మనస్సంగము, సంకల్పము, జాగరము, కృశత, అరతి, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, మరణము అనునవి పదియు మన్మథావస్థలు, స్తంభము, ప్రళయము, రోమాంచము, స్వేదము, వైవర్ణ్యము, వేపథు, అశ్రువు, వైస్వర్యము అనునవి సాత్త్విక భావములు) అది మన్మథావస్థా సాత్త్వికభావముల క్రిందికిపోయి, సత్యప్రవరుఁడు వెళ్ళిపోయి మాయాప్రవరుడు వచ్చు మధ్యకాలమున వరూధిని యనుభవించిన తాపము అభిలాషవిప్రలంభముక్రిందికిఁ బరిణమించినది. అచ్చట చెలులయెదుట వరూధిని విరహబాధ పడినట్లు పెద్దన వర్ణించుట 'నవినా విప్రలంభేన శృంగారః పుష్టిమశ్నుతే' (ఎడబాటు ననుభవించనదే కలయిక రమణీయతను బొందదు) యన్నట్లు విప్రలంభ శృంగార పోషణము కొఱకేనా యని తోచును. తటాలునగాక ఆలస్యముగా వచ్చిననే గాని ప్రవరుని చిత్తపరివర్తనమున కవకాశము దొరుకదు. కనుక నావిలంబ మవసరమే యన్నచో నదియు కావ్యదృష్టిలో రసప్రయోజనము క్రిందికే మారును. ఎన్నివంకరలు తిరిగినను వరూధినీ హృదయగతమైన రతిభావము అకుంఠితముగానే క్రమవికాసమును బొంది రసభావతను పొందినది. మాయాప్రవరుని నటనము వరూధినిని మోసగించినట్లుగానే పెద్దన కవితాశిల్పము రసజ్ఞలోకమును మోసగించి రసానుభూతినిఁ జేకూర్చినది. దీనిని రసాభాసమని త్రోసివేయుటెట్లో తెలియుటలేదు. రసజగత్తునకు విరుద్ధములయిన యితరాంశములను గ్రహించి అంగ ప్రత్యంగములను విడగొట్టి పరిశోధనముఁ జేయుట

కిది ప్రకృతిశాస్త్రము కాదుగదా ? ఒకవిధమైన కళాపారవశ్యము గల రసజ్ఞునికే కావ్యరసానుభూతి కలుగును. అట్టివారికి రససిద్ధిని చేకూర్చుటలో పెద్దన కావ్యశిల్పము కృతకృత్యమైనది. కనుక మనుచరిత్ర రసాభాసకావ్య మని సిద్ధాంతీకరించుటకంటె ఆపాతముగాఁ గనఁబడు రసాభాసము రసీభావపర్యవసన్న మైనదనుటకు తగిన సాధక సామగ్రిని వెదకు శేముషీ వైభవమునకై ప్రయత్నించుట కావ్యరస పిపాసువుల ధర్మము.(ఇంతకును రసాభాసము వ్యవహారమాత్ర ప్రతీతిగలదియే కాని సత్యముకాదు. అలౌకిక రసమునకు ఆభాసత్వము సిద్ధింప నేరదని కావ్యప్రకాశ వ్యాఖ్యాత వామనాచార్య ఝల్కీకర్ వ్రాసియున్నాడు.)

ప్రథమ ద్వితీయాశ్వాసముల యందు శాంత శృంగార రసముల స్పర్థ వర్ణింపఁబడిన దనియు నొక ప్రవాదము గలదు. శాంతరసమునకు ప్రవరుడు ఆలంబనముగదా ! అతని యందుఁగల వైరాగ్యము సంసారాసారబుద్ధిచే గలిగినదికాదు ఆవైరాగ్యమునకు పరస్త్రీ వైముఖ్యమేకారణము. దానిని గ్రంథకర్తయే వ్యాఖ్యానించినాడు. లేనిచో ప్రవరుడు తల్లిదండ్రులను గురించియు, ఇల్లాలిని గురించియు, అగ్నులను, అరణులను, శిష్యులను గురించియు విలపించ వలసిన పనిలేదు. ఇంతకు కొందరి మతమున శాంతము రసమేకాదు. రసముగా నంగీకరించినవారి పక్షమందును దాని స్థాయీభావము 'నిర్వేదము' (నిర్వేదో నిష్ఫలత్వధీః=దేనియందును వాంఛలేక యుండుట.) ఆనిర్వేదము రసీభావమును పొందుటకు తృష్ణాక్షయ, దేహాభిమానశూన్యతాదులు దోహదము నొసగినట్లు వర్ణింపవలెను. మన ప్రవరుడు కర్మఠుడు, ఏకపత్నీవ్రతుడు,ధార్మికుడునుగాని మోక్షమునకై సంసారమును ద్యజింపఁ బూనుకున్నవాఁడు కాడు. కనుక శాంతరసమునకుఁ బ్రసక్తి కానరాదు. వరూధినీ రతిభావమును తఱచి తఱచి గట్టిపరచుటకు కూర్చిన ధార్మిక ప్రతిఘటనమే గాని ప్రవరాలంబనముగా మరియొక స్థాయిభావమును పోషించి రసత్వమును పొందించు ప్రయత్నమును కవి చేయనేలేదు. కాదని వాదించినచో నెమ్మదిగా నాలోచించి ప్రవరాలంబనముగా ధర్మవీరము విలసిల్లినదనియు, ఆ ధర్మవీరము శృంగారముతో ప్రతిఘటించి

తన వారిని తాను పోయినదనియు, ఆ ప్రతిఘటనము ప్రస్తుత శృంగారమునకు దోహదముగాఁ బరిణమించినదనియుఁ జెప్పవలసియుండును. ఇది రసచర్చయైనను మాయా ప్రవరుని సౌందర్య దిదృక్షయందు పానకములో పుల్లవలె నుండును గనుక ఈ దిఙ్మాత్ర దర్శనముతో విడిచి ప్రకృత మనుసరింతము.

భోగ లంపటుడైన గంధర్వునికి వరూధినీ గర్భము కన్నులు దెరపించినది. ఇక ఆలస్యము చేయుట యేవిధముగను లాభదాయకము గాదు. గుట్టు బయట బడినచో, శాపాగ్నితిప్పుడు గావలసి వచ్చును. కనుక మెల్లగా జారుకొనుట యుక్తమనుకున్నాడు. కాని తననింతగా మన్మథ సామ్రాజ్యాధిరాజునిజేసి, తనపై పంచప్రాణములను బెట్టుకొన్న ప్రియురాలికిఁ జెప్పకయే పోయినచో నామె జీవించుట శంకాస్పదము కాఁగలదు, కావున చెప్పి ఆమెతో ఒప్పించుకొని పోదలఁచినాడు. ఇంత నేర్పరియగు గంధర్వునికిది క్లిష్టసమస్యగాదు. కనుక నే మెల్లగా వరూధిని దగ్గరకు వెళ్ళి బుజ్జగించుచు, 'తరుణీ! ఎవఁడువచ్చి యొక్కింత పాదలేపము పూయుటచేత నింతపని జరిగినదో బహు యోజనాధ్వగామియైన ఆ మహాయోగి ఈరోజు నాకంటబడిఁ మా సంసార పరిస్థితులను కథలుగా చెప్పిపోయినాడు. ఏమి చెప్పుచుందువు!

సీ॥ 'పైపరామరిక చొప్పడమిఁ బసిఁ ద్రుమదప్పి
పండఁబాఱిన పొల మొండఁబాఱెఁ
గట్టఁ గాపింప దక్షత లేమి నూరూర
బందెలఁ బడిపోయెఁ బసుగణంబు
వంచనామతిఁ బ్రాడ్వివాకులై వటువు లో
జ్జల కొప్పగించిరి చదువులెల్లఁ
గికురించి రిచ్చ పుచ్చుకొనుచోటులవార
లాఁకకు లోనుగా కప్పలీక

తే॥ గ్రహణ సంక్రమణాదుల రాచనగరఁ
గానుపీసంబు వెడలమి గ్రాసమునకు

నాధి పెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని
లెస్సయుండునె గృహకర్త లేని బ్రదుకు.'

అంతేకాక నే నిచ్చటికి వచ్చినప్పటి నుండియు నిద్దఱు ముదుస ళ్ళును పుత్రమోహముతో నెదురుచూచుచు, కంటితడి తెలుగక, కడి దటిగి వ్యాధులతో మంచపుఁ దొడుగఱ లైరట. వారిని విడిచియుండుట ధర్మముగాదు. నీ వెఱుగని ధర్మాధర్మస్థితి యేమున్నది? అన్నాడు. ఇందు ప్రవరుని గార్హస్థ్యజీవితము చక్కఁగాఁ బ్రతిబింబించుటయేగాక ఆనాటి తెలుగునాటి గృహకర్త లేని బ్రతుకును స్ఫురింపఁ జేయుచున్నది. ఈవిధమైన యతని సంభాషణము సత్యాప్రవరుని శ్రోత్రియత్వమును మర పించుచున్నది. ఈమాత్రపు మాటలకు వరూధిని సమ్మతించునా? అందుకని భోగతృష్ణ చల్లారనిది దానికై ధర్మముల విడుట యుక్తము గాదని ధర్మోపన్యాసమును మొదలుపెట్టె, ఎన్నడును దెగని కాంక్షను రోసి పోవుట కాదు గాని. కోరికకే పెద్దరిక మిచ్చినచో సంపెంగలో భృంగము చిక్కినట్లు నే నిచ్చటనే చిక్కిపోవలసి వచ్చును. భవిష్య త్తును తలపక సుఖైక రతిలో నున్నచో, వంశహాని, వ్రతహాని, యశో ధన హానియుఁ గలుగును. కనుక పోయివచ్చెదనని సుకుమారముగా నర్థించినాడు.

ఆమాటలు విన్నతోడనే వరూధిని గుండె జల్లుమని మారాడలేక చిమ్మలై చిలుపలై జాలై తరంగములయిన కన్నీరు గార్చి దుఃఖించి నది. గంధర్వుఁడు వరూధినీ వదనమును వక్షస్థలమునఁ జేర్చుకొని,

శా॥ ధీరస్వాంతవు వంత నీకు దగునే దివ్యాంగనల్ కోవిదల్
గారే యోగ వియోగముల్ సతములే కర్తవ్యముల్ సేయరే
పోరే రారె ప్రియంబు గల్గినజనుల్ పోరాము పోఁబోవునే
పోరాకుండగ నేమి కాళ్ళు దెగెనే ఫుల్లాంబుజాక్షీ తేక్షణా!

అని బుజ్జగించినాడు. ఇందులో మాయాప్రవరుని సమయజ్ఞతతోఁ కాటు పెదవలోకజ తయు విలసిలినది. పోయిన పోకగాబోవుదు ననుకొన

తము. ఈ తడవ యోగి కనవడినప్పుడు పాదలేప రహస్యమును మూలముట్టుగఁ దెలిసికొన్నాను. పోవుచు వచ్చుచునుండెదనని చెప్పి, వరూధిని నూరడించి యామెచే నంగీకరింపజేసికొని మాయాప్రవరుఁడు మాయమయినాఁడు.

ఈ విధముగా గంధర్వుని యందు శాంబరీమహిమ ద్వారా ప్రతిబింబించిన ప్రవర తత్త్వము స్వారోచిషమనువు వంశమహత్త్వకుఁ గారణమైనది. మాయాప్రవరుని శ్రోత్రియ నటనలు, శృంగారచేష్టలు, గృహస్థ బాధ్యతలు, ప్రియురాలి బుజ్జగింపులు వరూధినితోపాటు రసజ్ఞలోకమును సైతము ముగ్ధమును గావించి, అతనికి సత్యప్రవరుని యభేదసిద్ధినే కాక ఇతివృత్తమునందు ప్రాధాన్యమును గూడ చేకూర్చినవి. కాలికి పూసనంటి యతనితోనే మనుచరిత్ర రత్నహారము సరస్వతీ కంఠాభరణమైనది. నిమిత్తమాత్రమైన గంధర్వత్వము పెద్దన శిల్ప చాతురిలో తిరోహితమైనది. మాయాప్రవరునిద్వారా ఫలించిన వరూధినీరాగరసము మనుజన్మ ప్రకారమునకుఁ గారణమై యతనిని దైవ మానవ మహత్వ విశిష్టుఁని జేసినది. ఈయంశమును గ్రంథకర్తయే,

సీ॥ 'మున్ను విప్రాకారమునఁ గూడుచో శంకఁ
గనుమాయఁ బనిచె నాఖచర భర్త,
యవ్వారారోహయు నాసక్తగావున
నిచ్చలో నటుసేయ నియ్యకొనియె
నాప్రతిజ్ఞాపూర్తి యయ్యెఁ దనంత న
వ్వనితకు రతిపారవశ్యవటిమ
నవుడు తత్ప్రవర దేహ సమిద్ధ శిఖిదీప్తి
శాంబరీ మహిమచే సంగ్రహించి
తే॥ నట్టి గంధర్వమూర్తి సౌఖ్యానుభూతిఁ
జలన మేదిన మానసాబ్జమున నిలువ
వెలసెఁ దేజోమయంబైన వృద్ధి నట్టి
మేటి గర్భంబు నెలలు తొమ్మిదియు నిండె.'

నని స్పష్టపరచినాడు. గంధర్వుఁడు ప్రవర రూపముతో పాటు ప్రవర దేహా సమిద్ధ శిఖిదీప్తినిఁ గూడ శాంబరీ మహిమచే గ్రహించి యుండుటయు, వరూధిని రతిపారవశ్య పటిమవలన చలన మేదిన మానసాబ్జమునఁ బ్రవర తేజస్సును నిలుపుకొనుటయుఁ దైవసమ్మతములై యుండుటచేత మాయాప్రవరపాత్రమునందు దోషలేశము లేకపోగా గుణశతము వెలసినది. కొలికి పూసవంటి యీ పాత్ర చిత్రణములో ఆంధ్ర కవితాపితామహుఁడు తన చతుర వచోరచనయందు సన్నిహితమైన శిల్ప నైపుణినిఁజూపినాడు. కావుననే ''పెద్దనవలెఁ గృతి సెప్పినఁ బెద్దనవలె'' నని కవిచౌడప్పయు నన్నాడు.



# ప్రబంధపాత్రలు

## వసుచరిత్ర — గిరికా వసురాజులు



ఆంధ్ర సరస్వతికిఁగల రత్నాలంకారములలో వసుచరిత్రము వజ్రహారము. ఇందుఁ బ్రరూఢములుగాని వర్ణ రేఖా ద్యుతులు లేవు. దీనిని డీకొని నిలువఁగల కావ్యరత్నముగాని, దీని యొఱపిడికి మొక్కఱిల్లని ధిషణాశాణముగాని లేదు. ఇది రామరాజభూషణ యశశ్శరీర విహార యోగ్య మందార తరువాటి. ఇది సకల కవికుల సంతతికి సంతత వసంత భాగ్యము. కావ్య మర్మజ్ఞులైన విజ్ఞులు తెలుఁగు పంచకావ్యములలో నగ్రస్థానము నొసఁగి గౌరవించిన గ్రంథరాజము.

ఈ కావ్యరత్నము విజయనగర సామ్రాజ్య సారస్వత ఖనిలో దొరకిన యమూల్య మణులలో నొకటి. ఆనాఁడు లభించిన ప్రబంధ మణులలో దేని యుజ్జ్వలత వానిదే యైనను దీని విశిష్ట ప్రభా తరళిమ పెరవానికి లేదు. ఏకైక దినప్రబంధ సంధానకుశలుఁడైన రామభూషణకవి పద్యైకప్రబంధముగా నీకావ్యమును నిబంధించినాఁడు. సంస్కృత కవులలో నొక శ్లోక మొక ప్రబంధ శతముతోఁ దూఁగు నన్న కీర్తి యమరుక కవికి దక్కినది. ('అమరుక కవే రేకః శ్లోకః ప్రబంధ శతాయతే') అట్లే తెలుగున పద్యైక ప్రబంధ గౌరవము వసుచరిత్రమునకే దక్కినదన్నచో కవితా మర్మజ్ఞులు వైమత్యమును జెందరని నాయూహ. కథావేగమున కాశింపక నిలుకడగాఁ బ్రతి పద్యమును జదివి యందలి చమత్కారమును గుర్తించువారి కొక్క పద్యమే యొక్క

ప్రబంధమును జదివిన లభింపఁగల యానందము నందఁజేయఁ గలదని మాదృశుల సంభావన.

కొందఱు వసుచరిత్రమునఁగల కథ మిక్కిలి చిన్నదనియు, అదియును వేగముతో సాగక తరు లతా కాసారాది దీర్ఘ వర్ణనలతోఁ గుంటుపడుచుండు ననియు భావించి యది యుత్తమ కావ్యము గాదని యాక్షేపించుచుందురు. 'లోకో భిన్నరుచి' యని దానిని వదల వచ్చును గాని భిన్నరుచిత్వమందును దరతమ భావ ముండునన్న సత్యమును గుర్తించుటకే మనము సాహిత్య విమర్శకుఁ బూనితిమి. కావ్య రచనమాట యెట్లున్నను గవితా విమర్శ సాధ్యమైనంతవఱకు సర్వ సమ్మతముగానే యుండవలయును. నాకీ కావ్యము నచ్చలేదు. నాకా ప్రబంధము ప్రాణతుల్యమను వ్యక్తిగతాభిప్రాయము పొగడుటయుఁ గాఁజాలదు. తెగడుటయుఁ గాఁజాలదు. కథా వేగము కుంటువడుటయు పడకుండుటయు కథయొక్క స్వభావమునకు సంబంధించిన విషయములు. కళాపూర్ణోదయమువంటి బహుళ పాత్రోపేతమైన యద్భుత కథలో నడుమ ననవసరముగాఁ జొనిపిన వర్ణనలు రసభంగమును గలిగించుననుట నిర్వివాదాంశము. ఇతివృత్తమునందు మెలికలు, అంతర్నాటికలు, అవాంతర వృత్తములును లేని సరసకథాసంవిధానమునం దడుగడుగున నద్భుత రచనా దౌరంధర్య విలసితములైన ప్రకృతి వర్ణనలు లేనిచో నాకథకు లభింపఁగల జిగిబిగి యేముండును? కేవల కథామాత్ర పరితృప్త హృదయులగు వారికిఁ గాంతాసమ్మితమైన వాఙ్మయముతోఁ బనియేమి? అట్టివారు సరస కావ్యశ్రవణమననాదులయందుఁ బ్రవృత్తులైనను గాకున్నను సమానమే.

వసు చరిత్రము నిష్కళంకమైన శృంగార రసము చిప్పిలుచున్న మధుచ్ఛత్రము. ఆ తేనెపెర మృదుల కవితా రసాల శాఖాగ్రమున నున్నది దాని నందుకొనఁబోవు రసిక పాంథులను కావ్య వనవాటి గిరి ఝరీ పరివ్యాప్తములైన పూఁబొదరిండ్లతోను, సురభిళ కమలోత్పల విలసిత జలాశయములతోను, సుకుమార పల్లవ కుట్మల భరిత తరు

లతా పుంజములతోను నేదదీర్చి యను పదమునం దాతిథ్య మొసంగి, నేత్రపర్వముగా రసమూర్తిని బ్రత్యక్షీకరించును. రాజమందిరమును దర్శింప నేగువాఁడు వివిధాలంకార నిలయమైన విపణివీధినిఁ బ్రతిబంధకముగా భావింపనట్లు సారస్వత పథికుఁడును రసమధు మార్గస్థములైన కవితా వన వైభవములను దిలకించుచుఁ బదపదమునఁ జొక్కుచు నేగునేకాని యొక్కమారు బుభుక్షితునివలె రసభాండముపై దుముకడుగదా! కనుక వసుచరిత్రములోని వర్ణనలు కథావేగ ప్రతిబంధకములనుట వాఙ్మయ వైచిత్రి నభినందింపఁజాలని సుకుమార బుద్ధుల మాట.

సర్వతోముఖ సమృద్ధమైన సంస్కృత భాష తెలుఁగునఁ గలియుటచేఁ బెద్దతములైన సర్వగుణములును ఆంధ్రభాష కబ్బినవి. అదీ కారణముగా నాంధ్రకవితయందుఁ బెక్కు సోపానము లేర్పడి, తెలుఁగు సరస్వతి సుందర మందిరమును దీర్చిదిద్దిన మహోన్నత సౌధముముగా నొనర్చినవి. ఎక్కఁగలవారి పిక్కబలముకొద్దియు నుపర్యుపరి సోపానములు ఉజ్జ్వలమైన వాఙ్మయ దర్పణమునఁ బ్రతిబింబించుఁ బ్రకృతి రామణీయకమును అనుభవ గోచరముఁ గావించుచుండును. సంస్కృత సాహిత్య సంప్రదాయమున లభించిన శ్లేష యను కావ్యాలంకారములును, స్వభావ సిద్ధములైన వాచ్య లక్ష్య వ్యంగ్యార్థములును, రసప్రతీతికిఁ దోడు పడునట్టి విభావాది సామగ్రియు, కావ్య నాయికా నాయక గుణ శీలాదులును, ఉక్తి వైచిత్ర్యములును, ఉన్నతానుభవములును, ఉత్కృష్ట భావనలును గలిగి కావ్యసంపద—లేదా పద్య రచనా చమత్కృతి యెంతగాఁ బెరుగ వలయునో యంత పెరిగి పరాకాష్ఠను జెందిన ప్రబంధరాజము వసుచరిత్రము. నానార్థములు, శ్లేషలు, వ్యంగ్యములు, లక్ష్యార్థములును సాహితీ సంపద్దారిద్ర్యముగల హృదయములకు కంటకములుగాఁ దోచుట వింతగాదు. సాధారణ మానవులు గోరు సరళ కథారచనలు వేరు. సాహిత్య సర్వస్వ జయ రమాంకమైన ప్రబంధాంక రచనా సంవిధానము వేరు. ఇది ధీరహృదయులైన సహృదయుల సామ్ము. [illegible] పై భాగమును ధాళ ధళ్యములతో నింపు సుందర

సువర్ణ కలశము. నిరంతర భావావేశ పూరితములైన పాత్రములతో నేక ధారగా సాగిపోవు కథ కావ్యవస్తువు కాకపోదుకాని దాని యుత్కృష్టత దానియందే యుండును. వివిధ వర్ణనోల్లిఖితమైన కథ బహుళాంశ ప్రీతి పాదకమై యానంద సందోహమును బ్రసాదించును. కళాపూర్ణోదయము కథా కల్పనముతో నద్భుతమును గలిగించినట్లు వసుచరిత్రము పద్య రచనా సంవిధానముతో సహృదయులను దలలూపించును. 'ఊహింపి తెలియరాకుండ సూరపరాజు శ్రమపడి కళాపూర్ణోదయము రచించె' నన్నవారును, బట్టుమూర్తి కవిత చేపలబుట్ట యల్లిక వంటిదని యాక్షేపించినవారును గలరన్నచో వారి నేమనఁగలము? కావ్యకళా విదులైన సహృదయులకు మాత్రమే ఈ కావ్యముల యందలి గుణ దోష పరిశీలనముఁ జేయఁగలహక్కుగలదని యొక్క సారి నొక్కి వక్కాణించి యూరకుందము.

వసుచరిత్రము సర్వలక్షణ సంపన్నమైన మహాకావ్యము. దీని యందు పుర నదీ నగాది వర్ణనలు రసోత్తరములుగాఁ గూర్పఁబడినవి. ఇందుఁ గావ్యేంద్రిర శబ్దార్థమయమైన తనువుతోను, మాధుర్యాది గుణములతోను, అలంకిరియా వితానముతోను, ఉత్తమ వృత్తులైన కైశిక్యాదులతోను గూడి ధ్వనిజీవమై విలసిల్లుచున్నది. ప్రధాన కథా సందర్భములందు ధ్వనిని, ఇతర వర్ణనలయందు గుణీభూత వ్యంగ్యమును విరివిగా స్ఫురింపఁజేసి రామరాజ భూషణుఁడు వ్యంగ్య స్ఫోరకమైన రచన యందును దన మెలఁకువను గనఁ బఱచుటచే నీకావ్య మర్థసంపద కాఁ వాలమైనది. ఇందుత్తమ లక్షణములు గల గిరికా వసురాజులు నాయికా నాయకులు. రసమంజరీకారుఁడు చెప్పిన యితర నాయికా లక్షణములు కొన్ని పురస్త్రీల వర్ణనలలోఁ బ్రతిఫలించుచున్నవి. ఇది శృంగారరస ప్రధానమైన మధుర మంజుల కావ్యము.

రాయల యుగమున్నాటికిఁ దెలుఁగున నాటకములు లేకుండుటచేతఁ గవికిఁ గల నాటకరచనాభిలాష యిందే ప్రతిబింబించినది. దానికిఁ గపటి యతి ప్రవేశము, వసురాజు తీగల చాటున నుండి "ఇది సంధింపఁగ వేళ"యని బయల్పడుట, మంజువాణి వసురాజునకు శయ్యాగృహ

మునఁ గనఁబడుట, హాసము వేయుట మొదలైనవి హావాదాక్షిప్తములై యద్భుతమును గలిగించుచు నుదాహరణప్రాయముగా నున్నవి. ఇంకను సూచ్యార్థ సూచనలు, పాత్రప్రవేశ సూచనలు గలిగి యిది యొక నాటకమువలె గోచరించును. ఇట్లు దృశ్య శ్రవ్య లక్షణములు గల యీ కావ్య మసాధారణ ప్రతిభావిలసిత మనుటలో వింత యేమున్నది?

బట్టుమూర్తియే రామరాజభూషణుఁడు. శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు కవిజీవితములలో బట్టుమూర్తి రామరాజభూషణులు విభిన్నులని చర్చించుటచే లోకమున భేదవాద మంకురించినది. ప్రాచీన గ్రంథ పరిశీలనమును, లోకప్రసిద్ధమైన జనశ్రుతిని ఆధారముగాఁ గైకొని శ్రీ వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు మూర్తి రామరాజభూషణులు భిన్నులు గారని యభేదవాదమును స్థిరపరచినారు. జిజ్ఞాసువులు వారి "వసుచరిత్రవిమర్శనమును" జూడవలసినదని కోరుచున్నాను. ఇతని పేరు మూర్తి. రామరాజ భూషణుఁ డనునది బిరుదము.

ఈకవి "యష్టదిగ్గజము"లలోని వాఁడైనను వయసున నందఱకంటెఁ జిన్నవాఁడు. పెద్దనకు శిష్యుఁడనియు జనశ్రుతి గలదు. శిష్యత్వమెట్టిదో తెలియఁ దగిన యాధారములు లేవు. కాని వసుచరిత్రము మనుచరిత్రకు శిష్యప్రాయముగానుండి గురుగుణముల నతిశయించుచుండుటచే, రామరాజభూషణుఁడు పెద్దనకు మించిన పెద్దతనమును గవితలో సంపాదింపఁ దలచినట్లు స్పష్టమగుచున్నది. ఒక పెద్దనయే కాదు తనకుఁ బూర్వులైన యెల్లవారి యశమును నొక్కుమ్మడిగాఁ గొల్లఁగొట్ట సమకట్టిన గట్టి పూనిక యతనిలో నుండుట చేతనే తెలుఁగు సారస్వతమున దీనివంటి దిదియే యని చెప్పఁదగిన వసుచరిత్ర మావిర్భవించినది. శృంగారనైషధమును, పినవీరభద్రకవి శృంగార శాకుంతలమును, మనుచరిత్రమును, సంస్కృత నైషధమును, కాళిదాసుని యభిజ్ఞాన శాకుంతలమును స్మరింపఁ జేయఁగల యనుకరణములెన్నియో యీకావ్యమున నున్నవి. అటనట గల యితర కావ్యముల పోలికలకు లెక్కయే లేదు. దీనివలన

నితనికిఁ గల బహుగ్రంథ పరిచితి వెల్లడి యగుటయేగాక మహాకవిత్వ దీక్షతో నుత్కృష్ట స్థాన మభిలషించి యుండెననుటయుఁ దెల్లమగుచున్నది. వసుచరిత్రము సమకాలీనులపై సవాలుచేసి వ్రాసిన కావ్య రత్నమా యనిపించును.

రామభూషణునికిఁ జిన్ననాటినుండియుఁ గల యద్భుత ప్రతిభా బీజములు రాయల సభలో మోసులెత్తి పెద్దనాదుల సాహచర్య దోహదములతో నిండార విరియఁ బూయఁగల కవితా కల్పలతను బ్రసాదింప జేసినట్లును, అది తిరుమలరాయ భుజాస్తంభమున కల్లుకొని కొల్లలుగా పూలజల్లులు రాల్చి పరిమళించినట్లును జనశ్రుతియు, చరిత్రయు, వసుచరిత్రయును దెలుపుచున్నవి. వేయేల అతని ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములు తెలుఁగుసీమలో నాడును నేడును మరియొక కవికి లేవు. అష్ట దిగ్గజములలోఁ బెక్కండ్రకు వలెనే యతనికినిఁ దనకృతికి రాయలను బతినిగాఁ జేయు భాగ్యము లభింపలేదన్నచో దానికిఁ జరిత్రయే కారణము. కవి కవితా గుణములు హేతువులుగావు. (బట్టుమూర్తి చిన్నవాఁడగుటయు పెద్దనాదుల ప్రాపకము రాయలయొద్ద నధికముగా నుండుటయు కృతి స్వీకృతికిఁ బ్రతిబంధకములు). ఏమైననేమి ఆర్వీటి బుక్కరాయల వంశము వాఁడైన తిరుమలదేవరాయల (ఎఱ తిమ్మరాజు) యదృష్టము పండినది. వసుచరిత్రకవితాకన్య యతనిని వరించినది. అట్లే నరస భూపాలీయము తిరుమలదేవరాయల మేనల్లుఁడైన అహోబల నరసరాజున కంకితము చేయఁబడినది. హరిశ్చంద్రనలోపాఖ్యానము శ్రీరామార్పితమై యశముఁ గూర్చినది. ఇట్లితని కావ్యము లిహ పర సాధకములై ధన్యత్వమును జేకూర్చినవి.

రామరాజభూషణుఁడు నిరంతర వాఙ్మయ తపఃప్రభావ యుతమైన ప్రతిభ గలవాఁడు. అతనిముందు సుప్రసన్నములై నిలువని యర్థములుగాని యతని జిహ్వారంగమునఁదాండవింపని పదబంధములుగాని లేవు. శబ్దమునకుఁగల నానార్థములు ఖలేకపోతన్యాయమున (కపోతములు కళ్ళమున వ్రాలునప్పుడన్నియు నొక్కమారుగా వ్రాలును

గాని ఒకదాని తరువాత మరియొకటి వ్రాలవు. అవిధముగానని యర్థము.) అతనికి స్ఫురించుచుండును. అంతేకాదు లాక్షణికార్థ వ్యంగార్థములును ఝుడితిస్ఫురణ గలవియై యతని శేముషీవీథిని విహరించుచుండును. తెలుఁగు పద సంధులలో సంస్కృతపదములును, సంస్కృతపదైకదేశమునఁ దెలుఁగుపదములును స్ఫురించి యవి శ్లేషార్థసంపద నినుమడింపఁజేయుభాగ్యము రామభూషణకవి కున్నంతగా మరియొకకవికి లేదు.

అతని రచనలయం దంతటను శబ్దాలంకార శోభితమైన యర్థాంతర ఘటనానైపుణి విలసిల్లుచుండును. అది వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానములందుఁ బరిణతమైన దనవచ్చును. కనుకనే లోకోత్తర కీర్తికాముఁడైన బట్టుమూర్తి మనుచరిత్రను మించునట్లుగా వసుచరిత్రను, రాఘవపాండవీయమును మించునట్లుగా హరిశ్చంద్ర నలోపాఖ్యానమును వ్రాసి ధన్యుఁడైనాఁడు. అతని యర్థాంతర ఘటనానైపుణి హరిశ్చంద్ర నలోపాఖ్యానమున వాచ్యభూమికను, వసుచరిత్రమున వ్యంగ్యభూమికను ధరించి సాహితీరంగమున నర్తించినదని మనము గుర్తింపవలయును. కావ్యాలంకారసంగ్రహమునఁ దాను నిబంధించిన కావ్యలక్షణముల ననుసరించి చిత్రకావ్యమునకు (అలంకార మాత్రభూయిష్ఠరచన) హరిశ్చంద్ర నలోపాఖ్యానమును, ధ్వని గుణీభూత వ్యంగములకు వసుచరిత్రను లక్ష్యములుగా విరచించి యాంధ్రసరస్వతి నలంకరించెనని మనము భావింప వలసియున్నది. (చిత్రకావ్య మన్నంతమాత్రమున హరిశ్చంద్రనలోపాఖ్యానము అధమ కావ్యమని భావింపరాదు. అర్థచిత్రమునకు మాత్రమే అది యుదాహరణప్రాయము.) "కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము" లన్నభావము గల యతని రచనలలోఁ గథను మాత్రము పట్టుకొని వ్రేలాడి విమర్శించువా రెట్టిలాభమును బొందఁజాలరని మన మెఱుంగవలయును.

కొందఱు చక్కఁగాఁ జదువకయే వసుచరిత్రము శబ్దాలంకార భూయిష్ఠమైన శ్లేషకావ్య మనియు, నారికేళపాకముగలది యనియు

గతానుగతికముగాఁ బలుకుచుందురు. అది మిథ్యావాదము. వసుచరిత్రమునందు కావ్యాంతర్గడుభూతములై, రసప్రతిబంధకములైన యమక చిత్రాలంకార రచనలు లేనేలేవు. ఉన్న శబ్దాలంకారములును ("నాళీకాకరతీర సారకదళీ నారంగపూగావళీ; ఏపారు పొదరిండ్ల నాపాటలాశోక" ప్రభృతులు) రచనా ప్రతిబంధకములుగాక రసపోషకములై యున్నవి. అపృథగ్యత్న నిర్వర్తితములై, యానుషంగికములైన యనుప్రాసములు కావ్యలక్ష్మికి శోభావహములైన సొమ్ములగుటచేతనే శ్రీహర్షాది మహాకవులు వానినిఁ బరిగ్రహించిరి. ఆ మార్గమున విజయయాత్ర సాగించిన రామరాజభూషణుఁడు కవి పండిత నికాయము నకు మాననీయుఁడనుటలో సందియములేదు. ఇఁక నటనటఁ గల ప్రకృతా ప్రకృత శ్లేషలు కావ్యవస్తు గౌరవము నినుమడింపఁ జేయుచున్న వేగాని కథకు ప్రతిబంధకములుగా లేవు. "జాతికినెల్ల రాజపరిచర్యయు, నీ తమ్ముల శుభవాసన, అనుపమ భాగ్యసంపద." మొదలైనపద్యములుదాహరణములు గానోపును. ధ్వని గుణీభూతవ్యంగ్యములు కావ్యమం దంతటను స్ఫురించుచుండుటచేత నివి యని కుప్పిచ్చియెత్తుట యనవసరము. సరళములనియు, ముద్దుపలుకులనియుఁ గొనియాడ బడుచున్న పారిజాతాపహరణాది కావ్యములందు బంధకవిత్వము గలదు. రామరాజభూషణుఁడు వసుచరిత్రమున బంధకవిత్వమునకుఁ దాపీయనే లేదు. పారిజాతాపహరణములోని మూడాశ్వాసములును మూడు విభిన్నములైన శయ్యలతోఁ గూర్చినాఁడు ముక్కుతిమ్మన్న. మనుచరిత్రమునందు మొదటి మూడాశ్వాసముల రచనకును దరువాతి మూడాశ్వాసముల రచనకును బోలికలేదు. అనేక కావ్యము లిట్టి విభిన్న శయ్యలకుఁ గుఱియైనవి. ఆమూలాగ్ర మొక్క శైలితోనే కావ్యరూపమును జక్కదిద్దిన వారిలో శ్రీనాథుఁడు, పింగళి సూరన్న, చేమకూర వెంకట కవి మొదలైనవారు కొందఱు మాత్రమే పరిగణింపఁ బడుదురు. అట్టి వారిలోను రామరాజభూషణుఁడు ముందడుగు వేసినట్లు వసుచరిత్రము నిరూపించుచున్నది. మొదటినుండి తుదివరకును పద్యముల నడక, అర్థగాంభీర్యము, రమణీయార్థ విస్ఫురణము మొదలైన యుత్తమగుణ

ములతో నేకధాటిగాఁ గావ్యమును నడిపిన కవితా సర్వస్వ మూర్తి ఒక్క భట్టుమూర్తియే యని కావ్యమర్మజ్ఞుల విచారధార. పిల్ల వసు చరిత్రలు బుట్టుటకు హేతువై, సంస్కృత భాషలోనికిఁ బరివర్తనముఁ జెందఁదగిన భాగ్యమునకు నోచికొని, ఆంధ్రవాఙ్మయలక్ష్మి నపూర్వా లంకార పరిశోభితను జేసిన వసుచరిత్రమును వ్రాసి, తనిసి తనియించిన శ్లేషకవితా చక్రవర్తికి, వ్యంగ్యవాసనా విలసిత వచోధురంధరునికి, రామరాజభూషణ కవిలోకపురందరునికి జోహారులు.

# వసురాజు

వసురాజు కులీనత్వాది గుణములు గలిగి అనల్ప కల్పనా చాతుర్యముచేఁ దీర్చి దిద్దఁబడిన మహానాయకుఁడు. ఇతిహాసోద్భవమైన వృత్తమును గావ్యవస్తువుగా గ్రహింపఁదలఁచి యుండుటచేఁ గవి వేద వ్యాస మునీంద్రునికి మాతామహుఁడైన యుపరిచరవసువును నాయకునిఁగాను, తద్వృత్తము నితివృత్తముగాను గ్రహించి వసుచరిత్ర ప్రబంధమును విరచించినాఁడు. చేదిదేశాధిపతియైన వసురాజు వేఁట కేగి యటఁ దపస్సును జేయుటయు, నతని తపస్సునకు మెచ్చిన యింద్రుఁడు తన సఖ్యమును, కనకరత్నమయమైన విమానమును, దేవత్వమును, సకల ప్రహరణ నివారకమైన యింద్రమాలయను కమలమాలను దుష్టశిక్షణ, శిష్టరక్షణ క్షమమైన వేణుయష్టినిఁ బ్రసాదించుటయుఁ దన్మూలమున వసురాజు విమానము నెక్కి యుపరిలోకములఁ జరించుటయు, ఇంద్రమాలాలాంఛితుఁడై యింద్రోత్సవములు జేసి దేవతలకుఁ బ్రియుఁడగుటయు, పిమ్మట నేవురుపుత్రులను గాంచుటయు, నిజపుర సమీపస్థయగు శుక్తిమతీ నదినిఁ గామించి నిరోధించి జనపదముల కుపప్లవము గల్పించిన కోలాహల పర్వతమును (వసురాజు) పాదముతోఁ దొలఁగఁద్రోయుటయు, పర్వత నిరోధముక్తయైన శుక్తిమతి పర్వత సమాగమమువలనఁ గలిగిన వసుపదుఁడను పుత్రుని, గిరికయను గూఁతును వసురాజునకుఁ గానుకఁగా సమర్పించుటయు, నతఁడు వసు

పదునకు సైన్యాధిపత్యమిచ్చి, గిరికను ధర్మపత్నిగా స్వీకరించుటయు ననునంశములు మహాభారతమునఁ జెప్పఁబడినవి.

భట్టుమూర్తి పుట్టురత్నము వంటి పై యాద్యసత్కథను గైకొని తన యపారిత కల్పనా విశేషమున సానలఁ దీరిన జాతి రత్నమునుగా వసుచరిత్రమును వెలయించినాఁడు. పై కథాభాగమును బెక్కుతీరుల మార్చినాఁడు. భారతమునందలి యుపరిచరవసువు తపశ్శాలి యగుచో వసుచరిత్రమునందలి వసురాజు ప్రతాపశాలి. ఇంద్రుఁడు తపమునకుఁ గాక కోలాహలమును గోట నెగమీటి నందులకు సఖ్యము పాటించె ననుట రసానుకూలమైన కల్పన. ఇంద్రుఁడిచ్చిన దివ్యమాలయు, వేణు యష్టియు వివాహ సందర్భమున నిచ్చినట్లు చెప్పుట వసురాజునకుఁ గల యింద్రసఖ్యమునకు గౌరవము నాపాదించుచున్నది. ఇట్టి యలఁతి యలఁతి మార్పులను గొన్నిటినిఁ జేసి, కాళిదాసుని శాకుంతలనాటకము నందలి పాత్ర ప్రవేశాదికములైన యంశములకుఁ బ్రతిబింబములనఁదగిన రసవద్ఘట్టములను సమకూర్చి వ్రాయఁబడిన వసుచరిత్రమునందు కీర్తిప్రతాప సుభగుఁడై, ఆర్తావన చణుఁడై, అఖిల గుణ గణాఢ్యుఁడై, బాహావర్తిత భూభరుఁడై, కావ్యగీత ప్రియుఁడై, పరికీర్తితుఁడైన వసుభర్తలో కులము, మహాభాగ్యము, ఉజ్జ్వలత (రూపసంపద), ఉదారత, మహోవిశాలత (తేజస్విత), ధర్మాకలన, వైదగ్ధియు (చేయుపనులయందలి చాతుర్యము) నను మహానాయకగుణముల కేమి కొదువ యుండును? అతఁడు నాయకరత్నము. అంతేకాదు పవిత్రమై యాదర్శప్రాయమైన యుత్తమ శృంగారరసమునకు నిష్కళంకాలంబనమైన నాయక సార్వభౌముఁడు ధీరోదాత్తశిఖామణి.

"సీ॥ తన యశోవిశద ముక్తాసౌధ పాళికి
నంబుదాయనము వాతాయనముగ
తన శౌర్య శిఖి శిఖాతతికి జాంబూనద
భూధరం బపరంజి పూదె గాఁగ

తన బలోద్ధత రజోదంభ కుంభినికిఁ
దారాగ్రహంబులు గర్భరత్నములుగ
తన దానధారాఖ్య వనధికి మిన్నేఱు
కల్లోల ధుత వారికణము గాఁగ
గీ॥ తన వినూతన సుగుణ సంతానవల్లి
సముదయంబున కంభోజ సంభవాండ
భాండము లఖండఫలపరంపరలు గాఁగ
వరలు భవ్య విభా విభావసుఁడు వసుఁడు."

"సీ॥ మీఱిన రాజు బల్మినడంప లోనైన
నభినవస్థితిఁ బెంప నతఁడె నేర్చు
దేఱి చూచినఁ దీవ్ర దీప్తిఁ జూప, జనాళి
కక్షిసాఫల్య మీ నతఁడె నేర్చు
సింధులింకఁ బ్రతాపశిఖిఁ బూన విశ్రాణి
తాంబుల నవి నింప నతఁడె నేర్చు
సమిదున్ముఖుని తేజము మలంపఁ బాదంబు
లంటిన వెలయింప నతఁడె నేర్చు
గీ॥ మండలము దాల్ప హరిదెస మైత్రి నిలుప నలఘు
సన్మార్గగతిఁ దెల్ప నతఁడె నేర్చు
నాజగద్బంధునకు వసురాజ నామ
మిడిన చతురాస్యు కౌశలం బెన్న నరిది."

యని రామరాజభూషణు డద్భుతరసావిష్టుడై వర్ణించిన వసురాజునందు జగద్బాంధవత్వమునకును (సూర్యత్వము), లోకోత్తర గుణోత్తర మహానాయకత్వమునకును గొఱఁత యేముండును? ఇఁక రసోత్తరముగా నడచిన కావ్య వస్తువునందలి నాయకుని యుచిత ప్రవర్తనమును బరిశీలింతముగాక.

కావ్యగీత ప్రియుఁడగుట యుత్తమ నాయక గుణములలో నొకటి. కావున గీతప్రియత్వము వసురాజునందు నిండారియుండె ననుట కతఁడు గిరికా మణిగృహము నందలి నాదమును విని యద్భుత రసావేశము నొందుట యుదాహరణ మగుచున్నది. (రామరాజ భూషణుఁడు సంగీత పండితుఁడు గావున సంగీతప్రియుఁడైన నాయకునిఁ గూర్చుకొనెనా యేమి!) కావుననే యుద్యాన విహారమును మాని గీతికా పరిశీలనము నతఁ బూనుకొనెను. నర్మసచివుఁడు చూచివచ్చి గిరికను వర్ణించునపుఁడు మైఁబులకరింప నామె సౌందర్యమును ధ్యానగోచరముఁ గావించు కొనుచు నుండెనేకాని యతని మాటల కడ్డు తగలలేదు. నర్మసచివుఁడు నాయికను ముఖాది పాదాంతముగా చిత్ర విచిత్ర రూపకములతో నభి వర్ణించిన దీర్ఘవర్ణనలలో బదులు పలుకక స్తంభమువలె నిలుచున్న వసురాజు నిర్జీవ ప్రతిమగా లేడా? యని కథావేగమునకు వర్ణనలు ప్రతిబంధకములని తలఁచువా రాక్షేపింపవచ్చును. అట్టివారికిఁ గథా వేగమే కాబట్టినదిగాని నాయికా సౌందర్య పరాకాష్ఠ యక్కఱలేదా? అంతసుదీర్ఘముగా వర్ణింపనిచో

"కమనీయాకృతి యోగ్యకీర్తనములఁ గన్పట్టు నా శ్యామ యా
సుమబాణాంబక యాయమూల్యమణి యాచొక్కంపుపూబంతి యా
సుమనోవల్లరి యా సుధాసరసి యాసొంపొందు డాల్దీవి యా
కొమరుంబ్రాయపు రంభ యాచిగురుటాకుంబోడి నీకే తగుఁ"

అని నర్మసచివుఁడు నాయకుని నువ్విళ్ళూరఁ జేయుట యెట్లు సాధ్యము కాగలదు? ఇంతకు నిది భారతకథ గాదు గనుక వసుచరిత్రనాయకుఁ డైన వసురాజునకు గిరికా వృత్తాంతము తెలియదు గదా! ఇఁక నాయకుఁడు నూత్ననాయికాసౌందర్యమును నర్మసచివాదులు వర్ణించునపుడు మనస్సులో భావశబలతను బొంది మైగగుర్పొడుచు సాత్త్విక భావాపన్నుఁడగునే కాని చెప్పువారి మాటల కడ్డముతగిలి యామెతల యెట్లున్నది? నిలువెంత యున్నది? అని రసభంగ ప్రసంగములు జేయునా?

కనుక విశారదుఁడు చేసిన గిరికా సౌందర్య వర్ణనమును నిరంతరానుభవముగా వినుటయే వసురాజునకు సహజము. విని చొక్కినాఁడు కనుకనే హితుని వాక్యము చొప్పున నీరజలోచన యున్న కోనకుం జన దివిరించినాఁడు. కిన్నరవిహంగవచనములును దోహదములైనవి. కనుక నీ ఘట్టమునందలి వసురాజప్రవర్తన ముచితముగానున్నదని భావింప వలసియున్నదే కాని యతఁడు రామరాజభూషణుఁడు కరువుఁబోసి పెట్టిన పాషాణ ప్రతిమయని తలంచుట నేరిమి గాదు.

పూఁబొదరింటి చాటుననున్న వసుక్ష్మాపాలుఁడు గిరికాసౌందర్యము నామూలచూడముగాఁగని వాఙ్మనసగోచరేతరంబైన యద్వైత రాగజలధిలోఁ దేలి, ఆశ్చర్యశాలియై, అనితరాయత్తమైన యాత్మలో వనితారూపము నభినుతించుట యతని కళాదృష్టికి నిదర్శనమగుచున్నది. నాయికా నిర్వర్ణనమును ( అవయవ సౌందర్యమును గుర్తించుట ) మహానాయకుఁడే యెఱుఁగును. ఇచ్చట నర్మసచివుని వర్ణనము తథ్యమగునా? కాదా? యని చూచుటయు వసురాజుపని. అనఁగా లోకోత్తర నాయిక యగునని గుర్తెఱుఁగుట. కనుకనే నర్మసచివుఁడు "నా పలుకు తథ్యంబౌఁగదా! యని తనయథార్థవాదిత్వమును నిలువఁబెట్టుకొనుటకై ప్రశ్నించుట జరిగినది. యతివేషము వేసికొని పోనున్న నర్మసచివునికిఁ గార్యగతిని సూచించు పట్టునఁ గడుజాగ్రతతో "ఏకతమున్న వధూజనంబు నీవేగతిఁ బల్కరించెదవో యిష్టసఖా!" యని హెచ్చరించిన నాయకునిలో నుచితజ్ఞత కేమి కొదువయుండును? వైదగ్ధ్యము వసురాజు గుణములలో నొకటియని చెప్పుటకిది యొక యుదాహరణము కాఁజాలును. ఆగుణమే లేనిచో సాక్షాత్తుగా (తాను పొదలచాటుననుండి) నాయికను జూచుచు తమకమెత్తిన నాయకుఁడు తపసివేషమున నర్మసఖుఁ బంపి, ఆపైన నాయికాభావములు గుర్తించి, తదుపరి సమయము చూచుకొని ప్రవేశించునంతటి నిలుకడ గలిగి యుండఁడుగదా!

యతివేషము ధరించిన విశారదుఁడు (నర్మసఖుఁడు) గిరికా మణి ధామమును బ్రవేశించుటయు, గిరిక ప్రణమిల్లిన నాశీర్వదించి యాసీనుఁడై ననర్మసఖునితో మంజువాణి వసురాజవృత్తాంతమును మంజుల వచః పుంజమున నభివర్ణించుటయు ననుఘట్టమున, నాయకుఁడైన వసురాజు చూపిన చాతుర్య మనితరసాధారణమైనది. భ్రమరబాధను నిమిత్తముగాఁ జేసికొని ప్రవేశించిన దుష్యంతునికంటెను, వసురాజకర గ్రహణము గిరిక కెన్నఁడులభించునాయని తొందరపడుచున్నట్లు చెప్పిన మంజువాణి మాటకుఁ దనిసి కపటయతి మర్త్యూ! యని మంత్రిబలమున నాకర్షించినప్డు "ఇది సంధింపగఁ వేళ" యని ప్రవేశించిన వసురాజు కళాభిజ్ఞుఁడుగాను, సరసుఁడుగాను గోచరించుచున్నాఁడు. నాయక ప్రవేశానంతరమున మంజువాణిచేసిన గిరికాసౌందర్యవర్ణనము సముచితముగా నుండుటయే గాక నాయకుని హృదయము సాభిలాషమగుట నుపచరించు చున్నది. ఆసమయమున వసురాజు చూపిన చాతుర్యము మిక్కిలి కొనియాడఁదగియున్నది. విదితాతనుమంత్రిజాలుఁడైన యతిఁడు పరమాప్తుఁడుగాక మునీంద్రమాత్రుఁడా! యని కపటయతినిఁ బ్రశంసించినాఁడు. అతని మంత్రి ప్రభావమువలన సముజ్జ్వలరూపకలాపమైన మీ యనుంగువయస్యను, దివ్యభామినులైన మిమ్మును జూడఁగంటి నన్నాడు. సౌందర్య దర్శనలాలసములైన చూపులతో నాయికాహృదయమును జూరఁగొన్నాఁడు.

లజ్జాభరమును సహింపలేని గిరిక మఱుఁగునకుఁబోయినది. యతి చేసిన "చింతితకళ్యాణసమృద్ధిరస్తు" అను నాశీర్వచనము శీఘ్రముగా ఫలింపవలెనని చెప్పి, సెలవుతీసికొని మంజువాణీప్రభృతులు గిరికవెంట బోయినారు. అప్పుడు గిరికావిరహమును సహింపలేని వసురాజు అనుభవించిన తాప మభిలాషవిప్రలంభమునకు లక్ష్యమగుచున్నది. ఈ కావ్యమునందు నాయికా నాయకు లిరువురును అభిలాషవిప్రలంభమునే యనుభవించిరి. విప్రలంభములేనిచో శృంగారము పుష్టినొందఁజాలదు (నవినా విప్రలంభేన శృంగారః పుష్టిమశ్నుతే). ఇతరములైన యీర్ష్యా, ప్రవాస,

విరహ, కరుణ విప్రలంభాదులు ఆస్వాద్యము లేవైనను నాయికానాయకులకు కష్టమును గలిగించునవి కొన్నియు, జీవితాంతమువరకు పరుంతాపదములై బాధించునవి కొన్నియు నగుటచేత "భూరిసంపదఁదలపువ్వు వాఁడనిభోగి" యైన వసురాజునకును, అభీష్టవరలక్ష్మీమధన్యాగాఁదగిన గిరికకును నవి దగియుండమిచే వారి కభిలాషవిప్రలంభము మాత్రమే గలిగెననియు, సమాగమానంతరము నిరంతరసుఖాంతముగా వారి దాంపత్యము సాగెననియు సహృదయులు భావింపవలసియున్నది.

విరహవేదనా దూయమాన మానసుఁడై వసురాజు తన మణిధామాభ్యంతరమునందలి పచ్చరాచిలుకలకోళ్ల మణిమంచముపై బ్రుప్పొడి పరుపున నొత్తగిల్లి చిత్రఫలక మీక్షించుసమయమున వెళ్ళి, మంచమునందలి యంత్రపుత్రికలలో నొక మణిపుత్రికయై మంజువాణిచేసిన ప్రసంగములకు బదులుపల్కిన నేర్పును, మణిహారమును బ్రశంసించిన ధోరణియు నాయకుఁడైన వసురాజుగుణములను ద్విగుణభావము నొందించుచున్నవి.

పెండ్లిపెత్తనమునకై సకలదేవతానీకముతో బయలుదేరిన యింద్రుఁడు కోలాహల పర్వతముఁజేరి యతనిచే "నింతకన్న శుభ మెయ్యది తొయ్యలిఁగన్నవారికిన్" అని యనిపించుకొని, ప్రతిష్ఠాన పురమునకు వచ్చి "నగేంద్రతనయాసాంద్రానురాగద్విపస్కంధారూఢుని నిన్నుఁబెండ్లికొడుకునుగా వింపగా వచ్చితిని" అని పలికినప్పుడన్ని విషయములును ముందే తెలిసియున్నను మహేంద్రుని యాపతిచే నానతపదసపంకజుఁడైన వసురాజు నాయకత్వములో వినయము, శృంగారలజ్జ, శుభలాభము గూర్చువిందుని యెడఁ గృతజ్ఞతాభావము ననుగుణములు గోచరించుచున్నవి. ఇంద్రాది దేవతలు స్వయముగా వివాహ కార్యములు చక్కదిద్దుచుండుటచే వసురాజునకు వివాహ మంగళము సుఖనిర్వర్తనీయమై, యచంచల గిరికానురాగ సుధాంబుధిలో నోలలాడుట కవకాశము నొసఁగినది.

పెండ్లికొడుకై వచ్చుట, కళ్యాణవేదిపై నడుగిడుట, సేసఁబ్రాలు పోయుట, సన్నెకల్లు ద్రొక్కుట మొదలైన వివాహోచిత కర్మలలో, వసురాజు రాగరసభరితమైన తన సుకుమార శృంగార నాయకత్వమును చక్కగా నిరూపించుకొన్నాడు. గురుజనసమ్మతితో శేషహోమాంతముగా వివాహవిధులు ముగించి, కనకరథముపైఁ గన్య నిడుకొని చేది రాజధానికరిగి, యఖండభోగము లనుభవించువసురాజు ముగ్ధానాయిక నలరింపవలసిన సుకుమారకళావిన్యాసములచే నలరించి, "లలిత నవోపభోగలీలాలతాంతసాయకుఁడు చేదిమేదినీనాయకుండు" అని యనిపించుకొన్నాఁడు. సకలకళాకోవిదుఁడై సరస శృంగార రసాశ్రియుఁడైన నాయకుఁడగుటచేతనే వసురాజు నెఱపిన గిరికాప్రణయ మీ విధముగాఁ బ్రశంసింపఁబడినది.

శా॥ "భూనాథాగ్రణికిన్ వధూమణికి సంభోగాంతసౌఖ్యంబు బ్ర
హ్మానందానుభవంబుఁ దెల్పె ననవద్యంబై, యవేద్యాంతరం
బై, నిర్లేపకలాపమై, క్రమవిముక్తానేకబంధానుసం
ధానంబై, యపునర్భవప్రభవఖేదంబై విజృంభించుచున్."

బ్రహ్మానంద సబ్రహ్మచారియైన రసము ఉదాత్తనాయికా నాయకు లాలంబన మైనప్పుడే స్ఫుటముగా స్ఫురించి యాస్వాదయోగ్యమగుచుండు నన్న సిద్ధాంతమును వెల్లడించి యాదర్శశృంగారనాయకుఁడైన వసురాజు నాయకత్వము సర్వలక్షణలక్షితమై ప్రశంసనీయముగా నున్నదనుటలో విప్రతిపత్తి యుండఁబోదని భావింతును.

## గిరిక

శుక్తిమతీ గర్భశుక్తిముక్తామణియైన యీకన్యకామణి మరాళములు మందయానమును, కాననశుకములు కలికి పలుకులను, మధుపాంగనలు మంజులగానములను, నీలకంఠములు నటనములను నేర్పుచుండఁగా మునిపురంధ్రిజనముల దీవనలతోఁ బెఱిగినది. వనదేవత లీయమను సైరంధ్రులై, దాదులై, వయస్యలై యనుదినమును బ్రోచినారు.

శు క్తిమతీ తీరవాసులైన మునులు "గిరిరాజతనయ కైవడి సిరి రాజిల వెలయు" నని యీ సుశీలకు గిరిక యన్న శుభనామము నిడినారు.

ప్రకృతిసంపదకుఁ బుట్టినింటైన శుక్తిమతీ కోలాహలము లందు బాల్యక్రీడలలోఁ జెలఁగిన యీయమ పెంపుసొంపు సహజరామణీయకమును బెంపొందించినది. ఈమె శుక్తిమతీ ద్వీపములలో నాడిన గూఢరత్నసికతాన్వేషము ("వెన్నెల కుప్పలు" అనునాట. ఇసుకలో నొక వస్తువు నుంచి యసంఖ్యాకములుగా మట్టికుప్పలు వోయుదురు. వెన్నెల రాత్రిలందీమట్టికుప్పలను కనుగొని వానియందున్న వస్తువిశేషమును దేవలయును. గిరిక మణులుదాచిన వెన్నెలకుప్పల యాటలను వనదేవతలతో నాడుచుండెడిదట),కోలాహల పర్వతప్రదేశములందు కల్పకపుష్పధూళితోఁ గట్టిన బొమ్మరిండ్లు,చిగురాకు పాత్రిలలో కేసరములు భక్ష్యములుగాను, మధురసము ఘృతముగాను, ప్రసూనపుంజము ఓగిరముగాను భావించి యాడిన గుజ్జనగూళ్ళును ఏ కావ్యనాయికలకును లేనివి. తల్లి సంకులవండ మెడయందలంకరింపగాఁ దండ్రి శంఖపరిభావకకంధరయైన గిరిక కివియేల యని తీసివైచి రత్నహార ముంచును. అది చూచి బిడ్డకు బరువగునేమోయని నదీలలామ కలువదండ వేయును. ఇట్లల్లారుముద్దై పెరిగిన గిరికకు, తల్లి సుకవిస్తోమమును రప్పించి (సుకవులనఁగా రాజహంసలు) ఘనవిద్యా మహిమలను గరతలామలకములు గావించినది. తండ్రియగు కోలాహల పర్వతము కిన్నరకోటులకుఁ ధనమణికూట సమర్పణముచేసి సంగీతముఁ జెప్పించెను. వారు కిన్నెర మీటుటకును, వీణవాయించుటకును, గీతప్రబంధములు చక్కగాఁ బాడుటకును, ఒకరికి నేర్పుటకును దగిన చాతుర్యమును గలిగించి యామెను గేయవిశారదను గావించిరి. వీణావాదన వేళలయందు ఘుమ్మను ప్రతిధ్వనివచ్చుటకును, గాలివచ్చినను వెలుతురులేని కొంతత దొలగుటకును, ముఖశ్రీకి ముకురమాగా నుండుటకును గోలాహలుఁడు గిరికకు మాణిక్యమందిరమును నిర్మించి యిచ్చినాఁడు. గంధర్వాప్సరోభామినులైన మంజువాణీ ప్రభృతులు చెలిమి వాటించి గిరికకు సఖిసంపత్తినిఁ గావలసినంతగాఁ గూర్చినారు.

ఇట్లు సకల సంపదలతోఁ గోలాహలవర్యతో పవనముందుల చెలులతో విహరించు గిరిక, తరువులపొంతఁ బొంచికాంచుచున్న వసురాజనర్మసఖునికి తరుణియై, తమోవినీలకచయై, తరళవిలోచనయై, తటిన్నిభగాత్రయై, తరుణ శశాంకఫాలయై, కనిపించినది. కావ్యపఠితయైన సహృదయుని హృదయదర్పణమునఁ దొలిసారిగా నాయిక ప్రత్యక్షమైన ఘట్టమును నిదియే· అనఁగా విశారదుఁడును, సహృదయుడును, నాయకుఁడైన వసురాజును జూచునాటికి గిరిక పరిపూర్ణయౌవనవతి. అంతే కాదు వీణావాదనప్రౌఢిచే చెలులను రంజిల్లఁ జేయుచున్న గానవిద్యాప్రవీణ. కనుకనే నర్మసఖుని డెందమునకు గౌరీసమాఖ్య మించ జనించిన యార్యగాను, సిరు లెల్లఁ కడ జల్ల వచ్చిన కమలపాణిగాను, గాంధర్వమును అవనికిఁ దెచ్చిన హంసయానగాను, సాంగయై మొనసిన యతను సమ్మోహవిద్యగాను గోచరించినది. ఇట్టియద్భుతకన్యాదర్శనమును జేసిన నర్మసఖుఁడు వసురాజున కెటిఁగించి యతనిఁ దెచ్చుటలోఁ జొచ్చము కలిగించునా ?

సీ॥ వలుదగుబ్బలు ప్రసేవకవృత్తిదగు గుబ్బకాయల కప
రంజిచాయలొసఁగ । లలితాంగుళీదళంబులు సమేళములైన
సారెలపై రాగసంపద లిడఁ । బాణికంకణరుతుల్ ప్రాణాను
బంధంబుగల తాళగతి కనుగ్రహము లీన । నాలాపభంగి
యత్యక్తసంవాది సమస్వరంబులకు గ్రామంబులునువఁ ।
గీ॥ బ్రచురతానామృతముల మూర్ఛనలచేన
చేతనంబులు చేతనరీతిఁ దనరఁ
జేతనంబు లచేతనభాతినొనర
వీణ వాయించునొకయలివేణిఁ గంటి’

ననిపోయిన మొగమునసే రాజునకు నివేదించినాఁడు. నెత్తమ్మి చూలి మెఱుపుతీఁగను బంగారు బురదలోకలిపి మదన ప్రతాపాగ్నిలో బుటముపెట్టి, తమ్మిగద్దియ దాకటిపైఁగొట్టి, యాకొన్నను సృజించుటకు సాధన సామగ్రిగాఁగొని యుండవచ్చునని తనయూహాబలమును ప్రసరింపఁజేసినాఁడు, సర్వాంగకములును బల్లివాద్యుపమాన వస్తువు

లను దృణీకరించుచున్నవని యామె సోయగమును బొగడిపోసినాఁడు. నరరాజకన్యలు, కిన్నరరాజకుమారికలు, ఫణాధర వీణాధర శోణాధరలు గిరికతోఁ బోల్పదగరని తుదిమాటగా నొక్కి వక్కాణించినాఁడు. (వసాధినీవీణావాదనములకన్న నీమె వీణావాదనములో సంగీతపాండిత్యమధికముగా వెల్లి విరిసినది. ప్రవరునిసృష్టికై పెద్దన యుపయోగించినసాధనసామగ్రి నేరశేటియసలు = బంగారము. గిరికాసృష్టిలో బంగారము పుటము వేయుటకు తోడువస్తువుగా మించుతీఁగె కుపయోగించినది. ప్రతి వర్ణనయందును మనుచరిత్రకన్న వసుచరిత్రనొక్క యడుగు ముందుకు వేయించుపట్టుదల రామరాజభూషణునిలో నుండుటచే గిరిక వరూధిని కన్న సౌందర్యరాశిగా మెఱుగులు దీరినది.) చక్కదనములదీవి యైన గిరిక సౌందర్యమును వర్ణించి వసురాజును కుసుమశర వశంవదునిఁ జేసి తన ప్రయత్నము ఫలించునట్లుగా,

మ॥ "కమనీయాకృతియోగ్యకీర్తనములన్ గన్పట్టునా శ్యామ, యా
సుమబాణాంబక, యా యమూల్యమణి, యాచొక్కంపుఁబూఁబంతి యా
సుమనోవల్లరి, యా సుధాసరసి, యా సొంపొందు డాల్దీవి, యా
కొమరుంబ్రాయపురంభ. యా చిగురుటాకుంబోఁడి నీకేతగున్"

అని విన్నవించిన విశారదుని మాటలవలన గిరిక వసురాజు హృదయాంబరమున విద్యుల్లతయై విరాజిల్లినది.

ఉత్తమ నాయిక కాఁదగిన కన్య యింతకంటెను సౌందర్యవతిగా నుండజాలదుగదా! ఇచ్చట గిరిక శ్యామగా వర్ణింపఁబడుటచే "శ్యామా యౌవనమధ్యస్థా" (యౌవనమధ్యమున నుండు నాయిక శ్యామయనఁబడును) యను లక్షణమువలన నాయిక ముగ్ధగా కనబడుటలేదే! వివాహ యోగ్యురాలై వసురాజుచేఁ బరిగ్రహింపఁబడనున్న నాయిక యౌవనమధ్యస్థగా నుండుటయేమి బాగు! ఉదయద్యౌవనగా నుండవలయునుగదా! యని కొందఱు తలఁపవచ్చును. నాయికా ప్రకరణమునఁ జెప్పఁబడిన ముగ్ధాది లక్షణములు నాయక సమాగమ సమయమునందలి నాయికల ప్రవర్తనమును దెలుపునవే కాని విశేషించి వారి వయోనిర్ణాయకములు గావు.

అత్యంతలజ్జావతిముగ్ధగాను, అనుభూతయౌవనయై యలంతిసిగ్గరితనము గలనాయిక మధ్య (లేక శ్యామ) గను, నాయకసన్నిధానమున లజ్జింపక ప్రౌఢానురాగము గల యువతి ప్రౌఢగాను గ్రహింపఁదగినవారే కాని అంగపుష్టి ననుసరించి వారిభేదమును బరిగణింపరాదు. పదునాఱేండ్ల యువతిముగ్ధ. ఇరువదియైదేండ్లవడతి మధ్య, ముప్పదియైదేండ్లదిప్రౌఢ యనుటలో చమత్కారము లేదు. గూఢానురాగ, మందానురాగ, ప్రకటానురాగములనే ముగ్ధాద్యవస్థకు కారణములుగాఁ గొనుట బాగు) సముజ్జృంభమాణ సర్వాంగశోభగల నాయికయు లజ్జాభరవిజిత మన్మథయైనచో నామె ముగ్ధయే యగును. ( వయస్సు ఆనుషంగికము )

ఇంతకును రామరాజభూషణుఁడీపద్యమున నుపయోగించిన శ్యామాశబ్దమున కర్థమే వేరు.

"శ్లో॥ శీతేసుఖోష్ణసర్వాంగీ గ్రీష్మేతుసుఖశీతలా, తప్తకాంచనవర్ణాభా సాస్త్రీశ్యామేతి కథ్యతే".

(చలికాలమున సుఖోష్ణములైన సర్వాంగములు గలదియును గ్రీష్మమునందు సుఖశీతలయైనదియును, తప్తకాంచనవర్ణము గలదియు నైనస్త్రీ శ్యామ యనబడును). యనులక్షణమువలన నీశ్యామ శబ్దము స్త్రీమాత్రపరము గనుక గిరికవివాహ సమయమునకు ముగ్ధయా? మధ్యయా? యనుశంక వొడముటకే యవకాశము లేదు. గిరికలో ముగ్ధా లక్షణములే యున్నట్లు పెక్కు నిదర్శనము లున్నవి. సర్వతోముఖమైన వాక్చాతుర్యముతో వర్ణించియు వసుపఖుడౌచిత్యమును పాటించి యామె సౌందర్య గుణములు వర్ణించుటకు నాబోంట్లకలవిగాదు. "కువలయాధీశ! నీవు గన్గొంటివేని చెలువచెలువాత్మఁ బాయక నిలుచునేమొ!" యని విన్నవించుటలో నాయిక సౌందర్యమును వసురాజువంటి రసికుఁడే గుర్తింపఁగలుగు ననియు గిరిక లోకోత్తర సౌందర్యవతియనియు ధ్వనించుచున్నది.

తత్ప్రథమముగా వసురాజసన్నిధి లభించినప్పుడు పద్మినియైన గిరికకు సరసాంతరంగమున రాగకందళమంకురించినది. చూపుతుమ్మెదలు

ములై తొలుత తొంగలిరెప్పలనాని, కుండలకాంతులలోఁ బొంచి, పూర్ణ చంద్రునిపై వెన్నెలపుల్గుల చాలువలె వసురాజుపై వ్రాలినవి. (ఇచ్చట వసురాజశబ్దమునకు సూర్యుడని యర్థాంతరమును గ్రహించినచో పద్మినీ శబ్దశ్లేషయొక్క మనోహరత్వము తెలియును.) ఇచ్చట నాయిక సంపూర్ణము గా ముగ్ధ యనిపించుకొన్నది. మంజువాణి వసురాజును సత్కరించి తనను గురించి చెప్పినప్పుడు తప్పుకొనిపోవుటకు వీలులేక నిలిచినది. అధికమగు చున్న లజ్జాభరమునకు నాయకసందర్శనేచ్ఛయు, దానికంటె యతిని ధిక్క రించి పోఁదగదను వినయమును ప్రతిబంధకములై యామె నచ్చటనే నిలిపి నవి. ముని వెళ్ళుటయు, అప్పుడువచ్చినవసురాజసఖునిలోఁ గపటమునిపోలి కలుగనఁబడి యంతయుఁ దేటతెల్లమైనపిమ్మట జరిగినసరసప్రసంగములకు తట్టుకొనలేకపోయినదిగిరిక. కనుక నే తలవంచి హారమణిలో నాయకప్రతి బింబమును గాంచి యానందించినది. ఆరహస్యమును గుర్తించిన యొక ధూర్త చెలి గుట్టునుబయటఁబెట్టగాఁ గోపమువచ్చి విద్యుల్లత మేఘముల చాటునకుఁ బోయినట్లు తెరచాటునకు చటుక్కున వెళ్లిపోయినది. ఈ ఘట్టమునందలి గిరికా ప్రవర్తనము సరసముగానుండి, యామె లావణ్యా మాధుర్యములను జక్కఁగాఁ దేటపరచుచున్నది.

వసురాజ ప్రథమదర్శన సముద్భూతమైన యనురాగము పెల్లుమీఱి యభిలాషవిప్రలంభము ననుభవించినప్పటిగిరిక ప్రవరుని యెడఁబాటునఁ బరితపించిన వరూధినిని స్మరింపజేయును. కాని వరూధినిలో నిగడుసుఁదన ముగాని, ప్రౌఢత గాని యీమెలో లేవు.

అళినాద కోకిలాలాప మలయపవనాదులకుఁ గలఁగి తల్లి కౌటిల్య మెన్నఁడు దలఁగు? తండ్రిహృదయమెన్నటికి గరఁగు? నని విచారసాగర ములో మునిగి జీవితమును రోసిన గిరికవిరహతాపము తద్గతమైన రతి భావమును బరిపక్వదశకుఁ దెచ్చు విప్రలంభశృంగారమున కుదాహరణ మై, యామెయందలి వసురాజపాణిగ్రహణత్వరను బ్రదీపింపఁజేయు చున్నది. ఈసందర్భమున గిరికయితరకావ్యనాయికలకుఁ దీసిపోవునదియుఁ గాదు, వాసి హెచ్చునదియుఁ గాదు. విరహమూర్ఛాగతయైన గిరికకుఁ

జెలులు చేసిన శైత్యోపచారాదిక్రియలు మాత్ర మితరనాయికలకు సుదుర్లభములు. ఆమె చేసిన చంద్రదూషణాదులు చమత్కారభూయిష్ఠములు. చంద్రాతపమును సహింపలేక మోమునఁ బటాగ్రము నొత్తి యెత్తి యేడ్చిన యామె శోకధ్వనిలో కిన్నరవధూ రాజత్కరాంభోజ కాంభోజీ మేళ విపంచికారవము మారుమ్రోగినది.

మంజువాణిగిరికావిరహావృత్తాంతమును వసురాజునకుఁ దెలిపి, తిరిగి వచ్చి చేసిన సంభాషణము వినుచుండిననాయిక పొదరింటిలోనుండి గిరికా వృత్తాంతమును వినుచుండిననాయకునితోఁ బోల్పదగియున్నది. ఇరువురి వృత్తముల నిరువురికి దేట తెల్లముఁ జేసినది మంజువాణియే, ఈ మంజువాణి మాలతిని మాధవునికిఁగూర్చిన కామందకివంటి చాతుర్యముగలది (మాలతీ మాధవమును భవభూతి కల్పించి వ్రాసెను. కనుక అందులో నద్భుతములు మిక్కుటముగా నున్నవి. కామందకి యోగిని యగుట మరియొక విశేషము. కేవల నాయికాసహకార ప్రావీణ్యా సాదృశ్యముచే మంజువాణి కామందకి వంటిదని గ్రహింపవలయును.) ఈపాత్రము లేనిచోఁ గావ్యమునకు వన్నెవచ్చుట దుర్లభము. నాయకుని పక్షమున నున్న విశారదుఁ డెంతటివాడో గిరికపక్షముననున్న మంజువాణియు నంతటిది. మంజువాణిచెప్పినమాటలలోగిరికకుస్పష్టముగా వసురాజునకుఁ దనపైఁగల యనురాగము తెల్లమైనది, మణిముద్రిక లభించుట బంగారమునకుఁ బరిమళమబ్బుట. ఆముద్రికను గిరిక కన్నులకద్దుకొని, కైశ్యమునఁ దురుముకొని. వక్షమునహత్తుకొని యానందించినది. నవకాంతి విభ్రమ విశేషములు దోప విన్నదనము పోయి చెన్ను వహించి మందహాసము చేసినది.

ఆఖండలప్రముఖమైన దేవతామండలము పెండ్లిపెద్దలై వచ్చి కళ్యాణమంగళముల నన్నింటిని దీర్చి రత్నపీఠములపై నునుచుటయాదిగా జగిరిన వివాహామహామునందు ఉచితలజ్జావతియై మెఃఁగిఃగిరిక యుత్తమ నూత్నవధూభావమును స్ఫురింపఁజేసినది, తలిదండ్రుల యెడబాటునకు బెగడొంది కంటతడిబెట్టుటయుఁనామెకులవధూమర్యాదను జాటుచున్నది.

పతియింటి కేగినపిమ్మటఁ గ్రమక్రమముగా రసికుఁడైన వసురాజు శిక్షణమువలనఁ గళాధురీణయై సకలోపభోగము లనుభవించుచుఁ బతివలన సాహిత్యరహస్యము నెఱిఁగి వెంటనే యతనికిఁ బ్రత్యుపదేశ మిచ్చినది. ఈవిధముగా గిరిక సంగీత సాహిత్య విద్యలయందుఁ బరిపూర్ణత వహించిన యుత్తమనాయిక.

మ॥ 'పదమెత్తన్ గలహంసలీల, యధరస్పందంబు సేయన్ శుభా
స్పదమారాగకదంబకంబు, శ్రుతిచూపన్ శ్రీవిలాసంబు, కే
ల్గదలింపన్ సుకుమారపల్లవనవైలాలక్ష్మి, వీక్షింప ష
ట్పదియుంబోల్పఁ; దరంబె కన్నఁగొనియాడన్ గేయవాక్ప్రౌఢిమన్.'

సంగీత రసమూర్తియైన కవికి నారాధ్యదేవత యైన యీనాయిక ఆదర్శశృంగార నాయిక యని భావింప వలసియున్నది.

ఇట్లు లోకోత్తర గుణోత్తరులైన నాయికానాయకులను, వారికిఁ జమత్కారచతురులైన చెలులను, మనోహరములైన వర్ణనలను, అద్భుత కథా సంవిధానములను గల్పించి పౌరాణికముగానున్న కథను సరసకావ్య దర్పణమునఁ బ్రతిబింబింపఁజేసిన రామరాజభూషణునికిఁ దెలుఁగునాఁడును ఋణపడియే యుండఁ గలదు.

# ప్రబంధపాత్రలు



## నీలాసుందరి.

కం॥ "హాటకగర్భనఘాలీలాటన చలితాంఘ్రి నూపురారావశ్రీ
పాటచ్చరములు తేనియ తేటలు మాకూచిమంచితిమ్మయమాటల్"

నీలాసుందరీపరిణయ కర్త యైన కూచిమంచి తిమ్మకవి పీఠికాపుర (పిఠాపుర) ప్రాంతమునందలి కందరాడగ్రామ కరణము. ఇతని జన్మస్థానము చందుపాలెము. ఇతఁడు "కవిసార్వభౌమ" బిరుదవిరాజితుఁడైన బహుకావ్యప్రణేత. రుక్మిణీపరిణయము, సర్వలక్షణసారసంగ్రహము, సర్ప పురీమాహాత్మ్యము, శివలీలావిలాసము, రాజశేఖరవిలాసము, సింహాచల మాహాత్మ్యము, అచ్చతెనుఁగురామాయణము, సారంగధరచరిత్రము. సాగరసంగమాహాత్మ్యము, రసికజనమనోభిరామము, నీలాసుందరీపరిణయము, కుక్కుటేశ్వరశతకము మొదలయిన చిఱుపొత్తములును, ఇతడు భాషాదేవికి సమర్పించిన యలంకారములు. నీలాద్రిమాధవరాయల (పీఠికాపురరాజు) మన్ననలతో తిమ్మన సింగన యను లేఖకపాఠకోత్తముల సహాయమున నమూల్యములైన కావ్యరత్నముల నాంధ్రులకొసంగిన కవితాసుధారాశి యీకూచిమంచి తిమ్మయ. ఇతనిగంటమునుండి దొరలిన తెలుఁగుపలుకుఁబడులు నీలాసుందరీపరిణయమునందును, అచ్చతెలుఁగు రామాయణమందును ముత్యాలపందిరి వెట్టినవి. అందును నీలాసుందరీపరిణయము ధారాళమైనధారతో విరాజిల్లుచున్నది.

నీలాసుందరీపరిణయమునకు మూలకథయనఁదగినది ఎఱ్ఱాప్రెగడ హరివంశమునందును, భాగవతదశమస్కంధమునందును, ఆచార్యసూక్తి ముక్తావళి యను వైష్ణవగ్రంథమునందును స్వల్పభేదములతోఁ గానవచ్చు

చున్నది. ( విష్ణుపురాణమునందును, ద్రవిడప్రబంధమునందును ఈ కథ గలదు ) కానిహరివంశకథయే దీనికి మూలమైనట్లు స్పష్టముగా గోచరించుచున్నది. హరివంశమునందు, కాలనేమి పుత్రులేడ్వురు కుంభకుని యింట వృషభములై పుట్టి చెలరేఁగుట, కృష్ణుఁడు నందాదులతోఁ గుంభకునియింటికిఁబోవుట, నందుడు గిబ్బల నడఁచినవానికి నీల నిచ్చెదనని చెప్పుట కృష్ణుండెద్దులను గీటడగించుట, నీలతోను నందాదులతోను కృష్ణుఁడుతన పల్లెకుఁ జనుటయు ననునంశములు గలవు. ఇంచుమించుగా నివియే నీలాసుందరీపరిణయమునఁ గలవు.

భాగవతమునందలి నాగ్నజితీపరిణయమునందీ కథాంశము కొంత వఱకుఁగలదు. అందు కోసలదేశరాజైన నగ్నజిత్తు తనకూతురు నాగ్నజితిని వివాహమాడుటకు "వాఁడికొమ్ములుగలవానిని, వీరగంధముసోకినఁ గాలుద్రవ్వెడువాని, నతిమదమత్తంబులైనవాని, గోవృషభంబుల నేడింటిఁ గూర్చితిగిచి, బాహుబలమున నెవ్వడు పట్టికట్టు' నతఁడుతగినవాడని చాటించెను. మధురాపురము నేలుచున్న రామకృష్ణులావార్తను విని సపరివారముగా బోయినతోడనే నగ్నజిత్తు స్వాగతమిచ్చి సమయమును ( శపథము ) దెలుపుటయు నాగ్నజితి కృష్ణుని వలచుటయు, కృష్ణుఁడు వృషభముల భంజించుటయు, నగ్నజిత్తు సంతసించి కూతురి నిచ్చి వివాహము నొనరించుటయు, తిరిగివచ్చుచున్న నాగ్నజితీకృష్ణులను పందెమున నోడిన రాజకుమారులు మార్గమునసడ్డగించి యర్జునగాండీవముక్తనారాచముల ఘోర్వఁజాలకపారిపోవుటయు, కృష్ణుఁడింటికిఁ జేరి నాగ్నజితిని అష్టభార్యలలో, జేర్చుకొనుటయు ననునంశములు గలవు.

ఇఁక నాచార్యసూక్తిముక్తావళి: కావేరీతీరమునందలి నిచులాపురమున ధర్మవర్మఁడను రాజుండెననియు, నతనికి నీలాంశయైన యొకకూతురు జనించెననియు, ఆమె యుద్యానక్రీడలలో వేటకు వచ్చిన శ్రీరంగపతిని ( విష్ణువును ) కామించెననియు, ధర్మవర్మఁడీవిషయమును శ్రీరంగపతితో నివేదింపనతఁడనుగ్రహించి నీలను వివాహమాడెననియుఁ దెలుపుచున్నది. హరివంశమునందలి కుంభకుఁడే యిందు ధర్మవర్మయైనాడు. నీలాసుందరీపరిణయమునఁ గల ధర్మండెవరో తెలియుటలేదు. బహుశః కల్పితుఁడు

కానోపును. ఇన్నింటిలోను హరివంశకథయే నీలాసుందరీపరిణయమునకు మూలకథయనుట సమంజసముగానుండును.

హరివంశకథయందు లేని రసవత్తరములైన యంశములను గల్పించి కూచిమంచితిమ్మయ యీకావ్యమును విరచించినాఁడు. ఇందు గోపాలబాలుఁడు మధురాపురమును జేరకముందే అనగా నందవ్రజమున నున్నప్పుడే గిబ్బలను గెలుచుట పందెముగాఁగల నీలాస్వయంవరమున విజయముగాంచెను. భాగవతకథలో నాయకునియందీయౌచిత్యము గాన రాదు. రాజైన కృష్ణుఁడు కోడెలను జయించుటలో నేమి యౌచిత్యము గలదు? కనుక తిమ్మకవి దానిని బాల్యమునకు మార్చి వరునిఁ బదియా రేండ్ల వానిగాఁజేసినాడు. నీలా సుందరిలోని గొల్లపడుచుఁదనమును మొక్కవోనీయక వన్నెలుదిద్ది నాయికనుగాఁ జేయుటలో కావ్యమునకు మరికొంత యందము చేకూరినది. నీల కథానాయికగా నేర్పడి వృషభ ముల ప్రాధాన్యము తగ్గుటయు నొకలాభము. ఇట్లు పౌరాణికమైన కథకు జీవముఁబోసి కళామయము గావించి కవి నీలాసుందరీ పరిణయ కావ్యమును రచించెను.

మిథిలానగరపరిభువగు ధర్మనియేలుఁబడిలో నున్న కుంభకుఁడను గొల్లదొరకు నీల ముద్దుబిడ్డ. ఆమెచెలువము చిలువచెలువలకుఁ గానిఁ అచ్చరచేడియలకుఁ గానిలేదు. కావ్యనాయిక కుండవలసిన సౌందర్యమంత యు నామె కున్నది. గొల్లపడుచైనను వరూథిని, గిరిక, ప్రభావతి మొద లైన కావ్యనాయికలకువలెనే భ్రమర కమలా ద్యుపమానవస్తువుల సధఃక రింపఁగల యవయవసౌందర్య మామెకునుగలదు. విష్ణుపత్నులైన శ్రీ భూ నీళలు సమానప్రతిపత్తిగలవారుగను, లోకోత్తరసౌందర్యము గల వారుగను గవులచే భావింపఁబడుటలో వింత యేమియు లేదు. కనుకనే కూచిమంచితిమ్మకవి గొల్లపిల్లయైన నీలను గిరికకు తగ్గనిరీతిగా వర్ణిం చెను. అయినను నీలాసుందరిలోని జానపదభావములు ఇతరకావ్య నాయికలకంటె నామెలో నొకప్రశాంతతను, ఒకమధురతనుఁ జే కూర్చినవి.

ఇతరనాయికలకు వనవిహారాదులయందు నాయకదర్శనమగుట యుఁ దన్మూలమున రాగోదయము గలిగి విరాళి గల్గుటయుఁ గాన వచ్చును. ఈమెకు సామాన్యకుటుంబమున జరుగు పద్ధతిపైననే నాయకునిపై ననురాగ మంకురించుటలో నాకనిరాడంబగత గలదు. నందుఁడు కుంభకునిదగ్గఱికిఁ గన్నె నడుగుటకై బ్రాహ్మణునిఁ బంపినాఁడు. ఆబ్రాహ్మణుఁడు మంచినేర్పరి. వరుఁడైన కృష్ణుని వర్ణించి చెప్పుటలోఁ బుష్కలమైన వాక్చాతుర్యము గలవాఁడు. కన్నెకుఁ గావలసినసౌందర్యము, తండ్రి మెచ్చుకొనఁదగిన శౌర్యధైర్యాదిమహిమలు శ్రీకృష్ణునియందుఁ గావలసినంతగాఁ బెంపొంది యున్నవని వర్ణించి చెప్పినాడు.

ఇంతకును కృష్ణుఁడు కుంభకునికి మేనల్లుఁడు; తన మేనల్లుని పౌరుషమువల్లనే నందుఁడు బృందావనములో నుసులులతో నిలువఁ గలిగినాఁడని కుంభకునికి బ్రాహ్మణుడు మొదటిమాటగాఁ జెప్పినప్పుడు నీల తన మనస్సులో శ్రీకృష్ణుని శౌర్యగుణమును బొగడికొన్నది. లోకరక్షణార్థమై విష్ణుఁడే నందునియింట కృష్ణుఁడై పుట్టెనని చెప్పి, పూతనాజీవితాపహరణాది మహిమోపేతములైన శ్రీకృష్ణ శౌర్యకథలను వర్ణించిన పట్టున కుంభకునికి భక్తిగౌరవములును, నీలకు తృప్తివాంఛలును రేకెత్తినవి.

"బుడుత కల్వలవిందు బోలు నెన్నొసలిపై జెలువంపు రారేక చిందులాడ"గా వ్రేతలగుట్టు లరయుటయు, చల్లలమ్మఁగఁబోవు గొల్లకొమ్మలను, నీరాట రేవులనున్న కన్నెలను. తలిరుఁబాయపు ముద్దుఁ జెలువలను గనుగీటి పలుకరించు వన్నెలాఁడైన మాయగొల్లని సోయగము, అతని రసికత నీల హృదయమున గాఢముగా నాటుకొన్నవి. బ్రాహ్మణుఁడు వరుని మహత్త్వమును, అతని చెయ్వులను వర్ణించి, అప్పటికిని గన్య హృదయమున వరునిరూపము చక్కఁగా హత్తుకొనెనో లేదో యని కాబోలు,     సీ॥ "బంగారుఁ దగటుదుప్పటి బిగ్గ మొలఁజుట్టి,

కేలఁజొక్కపుఁ బిల్లఁ గ్రోలు వట్టి
పెంపారు బలునెమ్మిపించె మాడలఁ బూని,
చెవిఁ జీకటిమ్మాని చివురు దోఁపి,

సొగసుగా నాసలఁ గస్తురిబొట్టు సవరించి,
క్రొన్నన సరపు లక్కన నమర్చి,
గురివెందపూసపేరొరయ సందిటఁ గట్టి,
సన్నంపు సెలగోల చంక నిఱికి,

తే॥ చెలిమికాండ్రను గూడి నిచ్చలము మీఱఁ
గడఁకతో నాలకదుపులఁ గాచుకొనుచు
గొమరు జళుకొత్త ననయంబు జమునపొంత
మెలఁగు నెనలేని హాయుల నమ్మేటివేల్పు."

అని యుగ్గడించినాఁడు. సహజసౌందర్యము నొలుకఁబోయు నా గోపవేషమే నీలడెందమునఁ జిందులు ద్రొక్కుచు నాటుకొన్నది. అంతే కాదు, తెలిదమ్మి రేకులను దెగడు కన్నులును, తొగల నెచ్చెలి నేలు మొగమును, కొదమతేటులఁ గేరు కురులును, మెట్టదమ్మిలవంటి పాదములును, తరఁగచాలువంటి తెఱులును, చిందము నెగ్గువలుకు కుత్తుకయు మొల్లమొగ్గలవంటి పల్మొనలును, చిగురాకు దొరయు కెంబెదవియు, తొలకరిమొగులువంటి మైచెలువును గల గోపాలకృష్ణుని రూపము కన్నులకుఁ గట్టినట్లై ఆకన్నె మేనఁ బులకలు నింపినది. ఇంతగాఁ దనయిష్టార్థమును జేకూర్ప వచ్చినవాఁడు గనుకనే తండ్రికనుసన్న లభించుటయే తడవుగా బ్రాహ్మణుని పాదములకు సోయగమొలుకఁ బునఃపునః ప్రణామము లాచరించినది. (కవి "మ్రొక్కులు" అని యిచ్చట బహువచన ముపయోగించుటలో రెండు భావము లున్నవి. ఒకటి నీలకు బ్రాహ్మణుని పైఁగల భక్త్యతిశయము వెల్లడియగుట. రెండవది బ్రాహ్మణుడు నీలా సౌందర్యమును చక్కఁగా దిలకించుట కనుకనే కవి యిచ్చట నాయికా సౌందర్యమును వర్ణించెను. చక్కఁగాఁ జూచినఁగాని బ్రాహ్మణుఁడు కృష్ణునితో వర్ణించి చెప్పలేఁడుగదా!.)

బ్రాహ్మణునికి మ్రొక్కి దీవన లందుటయేగాక తండ్రియనుమతిచే హస్తసాముద్రికముఁ జెప్పించుకొనుటయు జరిగినది. బ్రాహ్మణుఁడు నీల శరీరలక్షణములను సైతము తిలకించి యీ విరిబోఁడి దొడ్డదొరను

జేపట్టి సిరుల నందఁ గలదని చెప్పినాఁడు. కుంభకుఁడు (నీలతండ్రి) ఇది నాపట్టి దీనికిఁదగిన వరుఁడున్న చోఁ దెలుపుము దేవరా! యని బ్రాహ్మణయ్య ను వేడినాఁడు. వేడుటలోను గులము, కలిమి, చెలువము, జవ్వనము, సిగ్గు, ప్రౌఢతనమును గల చిన్నవాఁడు గావలయు నన్నాఁడు. తండ్రి యింతసముచితముగాఁ గోరియుండుటయు, చెప్పువాఁడు కుంభకుని కాత్మబంధువుఁడైన నందుని యొజ్జబ్రాహ్మణుఁడగుటయుఁ గారణములుగా నతని పలుకులు తండ్రికివలెనే తనకును వేదాక్షరములని నీల తనహృదయమున భావించి మిన్నకుండినది. గుణవంతుఁడును రూపవంతుఁడునైన వరునిఁ బెద్దవారే నిర్ణయించి తెచ్చునపుడు కన్య స్వతంత్రించి తనకు నచ్చువాఁడెచ్చట దొరకునా? యని ప్రాకులాడ వలసినపని యేముండును? అందును గొల్లపడుచై తల్లిదండ్రుల యదుపుఁలో నున్న నీల కసలే పనిలేకపోయినది. ఇంతకును వారు నిర్ణయించినది మేనరికమే. మేనబావయైన గోపాల కృష్ణునిఁ గని ప్రేమించి యుండకున్నను, అతని లోకోత్తరచరిత్రను, అతని చక్కదనమును విని యువ్విళ్లూరుచుండుట నీలకు సామాన్యమైన విషయము. ఆమె కంతకుముందే తండ్రియెదుట బ్రాహ్మణుని చేవర్ణింపబడిన గోపాలబాలుని గుణములు మనసుకెక్కి చిత్తమును రాగరసాయత్తమునుగావించినవి. ఆమె యనుకొన్నట్లుగానే బ్రాహ్మణయ్య కుంభకునితో నందునిపట్టియైన కృష్ణుని కిమ్మనియు, "నీ కిప్పుడా నుడిపాల్దాలుపు కన్న వేలుకలరే చుట్టంబు లేవంకలన్" అనియు నొక్కి చెప్పినాడు ఆమాట కుంభకునికిని అతని భార్య ధర్మదకును నచ్చి కన్యకు కోరిన మగఁడు దొరికెగదా యని యుబ్బిపోయినారు. నీలాసుందరి దనకోరికయు, బ్రాహ్మణవాక్యమును నొకటియై తల్లిదండ్రుల యనుమతి లభించినందులకు మురిసిపోయినది.

ఇచ్చట నాయిక నాయకసందర్శనమువలన గాక తద్గుణశ్రవణము వలన రాగిలియుండుటచే నామెకుఁగలిగిన యాదిమవిరహము (అభిలాష విప్రలంభము) మిక్కిలి బరువుగలదిగా నేర్పడినది. గిరికాదులకు నాయకుఁడెప్పుడంగీకరించునో యన్న తహతహపాటు మాత్రమే విరాళికిఁ గారణమైనది. నీలకు నాయకదర్శనము మొదలుకొని దమయంత్యాదులకువలె

పరమవాంఛితము. కనుకనే యీనాయిక "ఎన్నఁడు సూతు మజ్జగము లేలెడు వేల్పు మోముదమ్మి"నని ముగ్ధవిరహాలాపము లారంభించినది. తా నతని శిరమున ముత్తైపుఁబ్రాలు వోయుటయే ఆబాల ప్రథమ విలాసకృత్యముగా భావించి చెందిన విరాళితోఁ బవిత్ర పరిణయసంపదయు గొల్లపడుచు గోలతనమును స్ఫురించి యితరనాయికలకంటె నీమెలో నొక వైలక్షణ్యమును భాసింపఁ జేయుచున్నవి. "వెన్నుని చిరునవ్వు వెన్నెలల్ పర్వఁక వలపుఁ బెంజీకటుల్ దొలఁగఁ గలవె?" యని యారంభించి పలికిన పలుకులలో ప్రహ్లాదుని భక్తిభావమును స్మరింపఁ జేయఁగల ధోరణి పొడకట్టుచున్నది. (ఇది నీకంటెను నీలాసుందరీపరిణయమును రచించిన కూచిమంచితిమ్మకవి కెక్కువగా సంబంధించియున్నది. అనగా నీఘట్టమున కవి పోతనరచన ననుసరించి పద్యముల నడిపినాడన్న మాట.) శ్రీకృష్ణునిపై నిరతిశయ రాగానుబంధము గల నీలకుఁ దనతోడి చెలులలోదా నుత్తమ వరునిఁ జేపట్టి వారికన్న మిన్నగ నుండవలె నన్న భావ మాదిలోనే కలదు. దానికై యామె యెన్నియో నోములు సైతము నోచియున్నది. కనుకనే యాసన్నభాగ్యయైన నీల "తొలునోముల మేలిప్పుడు, వలనుగఁ జేకూడ వలదె వన్నెలగనినై, యలరెడు వలమురి తాలుపు, చెలిమి వెసఁ గలిగి యెల్ల చెలులుం బొగడన్" అని తలఁచుకొని విరాళినిఁ జెందినది.

ఇఁక విరహాఖ్యలో నామె క్రమక్రమముగా రాగోద్రేకము గల్గి పలికిన పలుకులలో గొల్లపడుచు కుండవలసిన కోరికలకును, ముగ్ధాత్వమునకును విరుద్ధముగానే కొన్నిమాటలు దొరలినవి. "చెలువమును, జవ్వనంబును, జెలిమియు, నెఱజాణతనము, సింగారంబున్, దలపున మెలఁగెడు గొనమును గలమగఁడెనలేని తొడవు గదతొయ్యలికిన్" అనుధర్మోక్తికిఁ బ్రసక్తి కానరాదు. తలఁపున మెలఁగుటయు మెలఁగక పోవుటయు నప్పటి కనిర్ధారితములు శ్రీకృష్ణుఁడే వరుఁడని నిర్ణయమించుమించుగా జరిగిపోయిన తదుపరి గలిగిన విరహవేదనలో

చం॥ "దిటవగు చెల్వముఁ గొనముఁ దేజును గల్గిన ముద్దుగుమ్మకున్
దటుకున నొక్కపాలసునిఁ దారిచి బిగ్గ నంటఁగట్టి చో

కన్నటయుగు నేపువాని కొఱకు గ్రద్దతిజాడల చేడెఁ గూఁకుచుఁ
గటకట తమ్మిచూలి కొఁ ఇగాములు బాములుగాఁదలంచెదక్

అని బ్రహ్మను దిట్టిపోయుటలో సొగసు గన్పట్టదు. ఇట్లే కొన్ని పద్యములు విరహము నెట్లైన వడవలెనన్న నిర్బంధముతోఁ బడినట్లు నాయికకుఁ గృత్రిమత్వమును జేకూర్చుచున్నవి. సహజసుందరమైన నీలాసుందరి విరహమును నిరాడంబరముగానే సాగించిన మిక్కిలి మనోహరముగా నుండెడిది. అట్టిపట్టులును గొన్ని గలవు. వానివలననే నీలాసుందరీ పాత్ర చిత్రణములోఁ గొంత సహజ సౌందర్య విలసనము గలిగినది.

పెల్లురేగిన తమకములో నితరకావ్యనాయికలవలెనే మత్తిల్లి యసందర్భాలాపములు బలికినను, మనసు స్వాధీనమునకు వచ్చి మన్మథ మన్మథుఁడైన మాయగొల్లఁడు పతియగునా లేదా? యను సంశయము పొడమినప్పుడు, దేవతలకుఁ బెట్టిన మ్రొక్కులలో నీలయొక్క గొల్ల వడుచుఁదనము చక్కఁగాఁ దెల్లమై యుల్లమున కానందమును గలిగించుచున్నది.

తే॥ 'పాలమున్నీటి గారాబుపట్టి మగఁడు
వేడుకలు మీర నను బెండ్లి యాడెనేని
గొప్ప చింబోతు కదుపులఁ గూర్చి నీకుఁ
గావువెట్టెంతు జమ్మిత్ర యో గంగనమ్మ.'

కం॥ 'తనతలపై వడి బల్లిదుఁ
డనువొప్పఁగ గ్రొత్తిముత్తమువుఁ దలఁబ్రాలో్వ
సినఁ దఱుగని యుండ్రంబులు
వెనకయ్యా! నీకొసగుదుఁ బ్రిదులని బత్తిన్.'

ఈ మొదలయిన స్తోత్రములతో నీల యిలువేలుపులను దలఁచి మ్రొక్కులు వెట్టిన పట్టులు ఆమె గోపనాయికాభావమును జక్కఁగాఁ బోషించుచున్నవి. ఎంతయును గృష్ణుఁడు తలంబ్రాలువోసి తాళిబొట్టును గట్టుటయే ఆమె పరమ వాంఛితము. శృంగారరసోత్తరంగములైన కామినీ

వాంఛలు తెచ్చిపెట్టుకొన్న నటనలే గాని యామెకు సహజసిద్ధములు గావు. అనఁగా నామెలో భోగాభిలాష కన్న దాంపత్యసంపద్వాంఛ నిండుగా మెండుకొని యుండెననిమనము భావింప వలసియున్నది. శ్రీకృష్ణుని స్పర్శసుఖ భాగ్యమును స్మరించుకొని విరహావ్యధను జెందినప్పుడును' కృష్ణుని వా తెఱ నాన నోచిన పిల్లఁగ్రోవిని, అతని యక్కున వ్రాలు భాగ్యము నొందిన తులసిపేరును, వాని చెక్కులను స్పృశింపఁ గల్గిన కొండగోఁగు పువ్వును, అతనిమేన నలరిన హొంబట్టు సన్నసాలువును, అతని యెదుట నర్తించుటకు నోచుకొన్న పురిపులుగు మొత్తమును (నెమళ్లను) ధన్యాతిధన్యములనుగా భావించి యట్టి భాగ్యము తనకెవ్వడు పట్టుననని తహతహపడిన నీల విరహవేదన మిక్కిలి రమణీయముగాను రసస్ఫోరకముగాను, పాత్రపోషకముగాను నున్నది.

కాలనేమి కొడుకులైన యేడుగురు రక్కసులు ఆఁబోతులై పుట్టి కుంభకుని మందను కలవరపరచుటయే గాక లోకమున కుపద్రవమును గల్గించి తన్మూలముగా ధర్మఁడను రాజునకు కుంభకునిపైఁ గోపము వచ్చునట్లుచేయుట దైవికమైన యొక విచిత్రసంఘటనము. ఈయాఁబోతుల యుపద్రవము లోకమున కెట్లున్నను నాయికయైన నీలకుఁ బ్రాణకంటకముగా మారినది. కృష్ణునికి నీల నియ్యఁదలఁచుకొన్న కుంభకుఁడు రాజభయము వలన నెవఁడు కోడెల బట్టఁగల జాణయో వానికే కన్నె నిచ్చెద నని చాటించినాఁడు. ఈచాటింపు గొల్లయునకులకు సంతోషకారణమై నీలకు స్వయంవరముగాఁ బరిణమించినది. ఈ స్వయంవర మహోత్సవములో నెద్దులను బట్టి, వానిమదము నణచుటయే పణము, ఆ పని జేయఁ గల్గినవాఁడు నీలకు భర్త. ఇట్టి యనిష్టము ప్రాప్తించుటచే నీల యెంత దిగులు పడవలయునో అంత దిగులు పడినది. కలిగిన యాస హుళక్కియై వెతఁ జెందుటయే ఫలమయ్యెనే యని పెక్కురీతుల వాపోయినది. "సోఁకుమూఁకల గొంగ యిచ్చోటికి కెమ్మె లూరఁ గొబ్బున వెంచేయ కుండెనేటిఁ జెల్లబో యింక నెటువంటి తెఱఁటి గొల్ల చెట్టఁ బట్టంగ దయ్యంబు జేయునోక్కొ!" యని యామె పడిన తత్తరపాటునకు మేరలేదు. (ఈఘట్టమునందును "మందార మకరంద మాధుర్యమునఁ

దేలు మధుపంబు వోవునే మదనములకు" అను భాగవత పద్యమును బోలిన దట్టంపు మిన్వాక తరఁగ చాల్వునఁ దేలు తెలివుల్గు బురద గోతులకుఁ జనునె!" యను పద్యమును వ్రాసి కవి నాయికా పాత్ర పోషణమును గుంటుపరచినాఁడు. ప్రకరణ వశమున కొంతవరకు సమర్థనీయమే యైనను నాయిక సహజమాధుర్యమునకు భంగము వాటిల్లఁ జేయుచున్నది). తాను మనసార వరించిన వాడును బెద్దలచే నుద్దేశింపఁబడినవాఁడును గాక తాత్కాలికపరిస్థితులవలన మనస్సును మార్చుకొన్న తండ్రియాజ్ఞ మేరకుఁ గోడలను బట్టినవానినిఁ జేపట్ట వలసి యుండుటచే నామెకు స్త్రీజన్మముపై నేవయు, స్త్రీస్వాతంత్ర్య వాంఛయు రేకెత్తి,

తే॥ "పుడమిలోపల మగవాఁడు పూని తనకుఁ
గోర్కెయగు కల్యకంటెఁ గైకొనుచు నుండు;
నహహా! తమమది కిచ్చయగా నట్లు మెలఁగఁ
గన్నియల కేమిటికి బల్మి గలుగ దయ్యొ."

నని వాపిడిచి యొక్కసారి వాపోయినది. అంతకన్న నేమిచేయఁగలదు పాపము! ఇఁక చేతనైన దేమియన జరిగిన సంఘటనలను దలఁచుకొని దుఃఖించుట. కృష్ణునిపై నాకు మనసుకల్గు సన్ని వేశము లెందుకు కలిగెనా యని విలపించినది. తాను కృష్ణునిఁ దప్ప మరియొకనిఁ జేపట్ట నని తల్లిదండ్రులతోఁ జెప్పెద మన్న సిగ్గును, భయమును బాధించుచున్నవి. కాని తనమనస్సునమాత్రము. "అలర వలమురితాలుపు చెలిమి తనకుఁ గలుగ కుండిన వేఱొక తులువ నింక వలవ నెవరేమి చేసినఁ దలఁక"వని దృఢముగా నిశ్చయించు కొన్నది. ఆశించినవస్తు ప్రాప్తిసంశయాస్పదమగుటచే భరింపరానివిరహవేదనకు నీల లోనుగావలసి వచ్చినది.

లతో నీల జాలిఁ జెందియుండుటను చెలిమికత్తెలు చూచినారు. కాని వారు త్వరగా మన్మథావస్థాస్వరూపమును గుర్తింపఁగల రాచ నగరు చెలులుగారు, గొల్లదొరయైన కుంభకుఁడొకపాటి యైశ్వర్యము గలవాఁ డగుటచే నతనికూతురైన నీలతోఁ జెలిమి పాటించిన సాధారణసఖులు. అంతేకాక కుల శీల సంపదలనుగాపాడుకొనఁగల లజ్జానతీత్వమున కేయ లవాటుపడినవారు. కనుక నిట్టి విపరీతపరివర్తనముగల నీల విరహమును గుర్తించి సహకరించుటకు బదులుగా, ఇది నీకు తగదని మందలించుట కారంభించినారు. నీవు కన్నియవేగాని పొరిడవుగావు నీవిట్లు సిగ్గువిడిచి పరివర్తించుట పాడిగాదని నీతులు బోధించినారు.

ఆమెహృదయవేదనను రవ్వంతయు గుర్తింపక "ముద్దుసెమ్మొగమునఁ గస్తూరి నేల దిద్దవనియు, పెన్నెఱులింపుగా దువ్వి పాటింపవేమని యు, నెమ్మేన మానికమ్ముల సొమ్ము లేల ధరింపవనియు, పెట్టెలోబెట్టిన పట్టుపుట్టము లెందుకుఁ గట్టవనియు, ఓగిరిము దినరాదా ? పువ్వులుముడువరాదా ? మాతోఁ బలుకరాదా? యనియుఁ దలకొకరీతిగాఁ బలికి నీలను గలఁచుట కారంభించినారు. ప్రేమకుఁజిక్కి మేను చిక్కిపోవ రేయింబవలు దిగులుపడు చిన్ను నలుగురును నగుచున్నారు మగువా ! యని హితోక్తులు చెప్పనూనినారు. అంతటితో మానక చిలుకకుఁ బద్దములుచెప్పు మనియు, హంసలకు నడకలు నేర్పు మనియు, నెమళ్ళకాటలు నేర్పుమనియు, పూదీవెలకుఁ బోరిదిసేయు మనియుఁ దమ విపరీతకళాభిరుచిని బయల్పరచినారు. కూరిమిచెలులాటలకు రమ్మన బలుకరింపకుండుట నీ కుచితముగాదన్నారు. అక్కడికిని నీల పలుకకుండుటచే నామొహ్యాద్గత భావమును జెప్పుమని కోరినారు. చెప్పినచో నీవెత మాన్పలేమా భయ మేల యన్నారు. ఆకారముచేతను, చేష్టలతోను పరేంగితమును గ్రహింపఁజాలని గోలలైన యీ గొల్లపడుచుల పరివర్తనము నీలాసుందరికి విసుగున్ను గలిగించుచున్నను, మిక్కిలి రమణీయముగాను, సందర్భోచిత ముగాను నున్నది. నాకిట్టి బాధ కలదని చెప్పిన మీఁదట నుపచరించునా ప్తులు మధ్యములేగాని యుత్తములు గారు. ఈ గొల్లపడుచు లట్టివారు గావుననే నీలకు వెంటనే సహకారమును జూపలేక పోయినారు. వారి

స్థితి యట్టిది నీల యేమిచేయును ? నీలాసుందరిపై సానుభూతిగల రసజ్ఞుఁడేమిచేయును ?

వలరాచ రాచశాటలో మెలఁగు నెఱజాణతనము లేకపోయినను దనపైఁగల విక్రాంపుఁజెలిమికి లోటులేనందున నీల చెలికత్తెలతోఁ దన విరాళిని సిగ్గువిడిచి చెప్పవలసిన దయ్యెను. వినుడు చెలులారా! యని తనకు చక్కని వింటిజోదు నెకసక్కెములాడఁగఁ జాలు పక్కిరాజెక్కువజీరు(శ్రీకృష్ణుని) చెల్వు చెవిఁ జక్కగ నాటిననాటినుండి యంతి నకూరిమిని, అది యెంత కంతకు నెక్కుసమైన విధమును జెప్పి, తప్పాతెన్నకమొదలినేస్త్రమును దలఁచి యీపని నొనగూర్పుఁడని వేడుకొన్నది. అట్లు చేసినచో మీ మేలును మఱచు దానను గానని యాస గొల్పినది. చివరికిఁ దన తెఱగు నంతయు వేడి కన్నీరొలుక వారితో విన్నవించుకొన్నది.

ఇంతగాఁ జెప్పుకొన్న నీలవెత వారిమనసున కెక్కనేలేదు. అజ్ఞాత ప్రణయులైన గొల్లపడుచు లెంతమొరటుగాఁ బ్రవర్తింపవలయునో అట్లు మెలఁగినారు. ఒకసఖి 'వన్నెయు వాసియు దఱిగి యిట్లువగచుట దగునా'? యని గద్దించి పలికినది. ఒకగోపిక "లిబ్బులచెలిపెనిమిటిపై నబ్బురపువ్వలపునిలిపితివి సిబ్బితి (సిగ్గు) లేదా? యని మందలించినది (లిబ్బుల చెలి లక్ష్మి లక్ష్మీనాథుఁడైన కృష్ణుఁడు నిన్నేల చేపట్టును? ఇదివింత విరహమాని యీ గోపిక భావన). మఱియొక చెలి కన్నెనైన నీవింత [illegible]గనై (గయ్యాళి) వలకాఁకలఁ జెందుట యుక్తముగాదన్నది. ఇంకొకసఖి 'అవునులే! కృష్ణుడీమాట వినగానే వచ్చి, వృషభములను భంజించి, [illegible]తో నిన్ను వివాహమాడి, పైఁడి యందలములో నిన్నెక్కించుకొని తన పల్లెకుఁ దీసికొనిపోయి, తన రతనంపు టుప్పరిగలోని గొజ్జఁగ సెజ్జఁ జేర్చినీకోర్కెలను దీర్చు నమ్ముకొను మని" యొక సక్కెములాడి నొప్పించినది. మఱియొక ప్రౌఢ నీలా! నీవు ముద్దుబిడ్డవి నీకీ గద్దఱిచందములు గవనియుఁ బెద్ద లున్నారనియు బుద్ధులు చెప్పినది. ఇట్లు విరుద్ధమాఁ[illegible]యుఁ బై పెచ్చు చిలుకలను బలుకరింపవేమనియు, నంచల రానీయ

వేమనియు, మామాటల కడ్డుచెప్పనిదానవు మమ్ముఁ గసరుకొనెద వేమనియు, మేమేమి నేరము జేసితి మనియు, నీకోరిక చేకూరనిమ్ము నీవలవంత నిలువనిమ్ము మమ్మేల యెగ్గులాడెద వనియుఁ దలకొకరీతినిఁ బలికి నీల మనస్సును గలఁచివేసినారు. ఆయుల్లరికి బదులు పలుకలేక పాపము నీల స్తబ్ధురాలై పోయినది.

ఇష్టసఖులైన చెలికత్తె లింతగాఁ దనను దెగడి పోయుదు రని నీల యెన్నఁడును దలఁపలేదు. వారియుపచారములును, వారిసహాయములును లేకున్న మానెగాని యిప్పుడు వారిని వదలించుకొనుట యొక దుష్కర కార్యమైనది. ఇఁక లాభము లేదని తలఁచి ధైర్యము వహించి నీల అమ్మలారా! ముమ్మరమైన వెతలలో మున్గుచున్న నా చుట్టును గ్రమ్మి యేల కొఱగాములువల్కి యేచెదరు? ఆచిగురాకుకటారిజోదు(మన్మథుఁడు) వేయు పూవమ్ముల చురుకుఁదనము మీ కేమి తెలియును?

కం॥ కడనుండి పెక్కుమాటలు
నుడువంగావచ్చుఁ గాక నూల్కొనియెడు వల్
కడగండ్లఁ బడఁగ వచ్చునె?
విడువక యెవ్వారికైన వెలదుకలారా!

యని వారిబాధ్యతలేనిప్రవర్తనము నొక్కసారి ఋచ్చియెత్తినది. వలఁపుసెగలలోఁ బడి వేఁగుదానినిచేపట్ట నొల్లక నిప్పులపై నేయి పోసినట్లుగా నున్న మీనడవడి యింపుగా లేదన్నది. నామాటలు మీకు వినుట కింపుగానిచో, మీరు సహింపజాలని వైనచో నింతేచాలు గాని యింక నన్నేమియు నెగ్గులాడి బాధింపవలదు మీకు కోటినమస్కారములు పెట్టెద నన్నది.

మీరు కూరిమిబోటులని మీపైఁగొండంతనమ్మిక పెట్టుకొని యున్న నన్ను నేరము లెంచి నవ్వఁగల గలఁగించితిరి. సారెసారెకును బరిహాసించితిరి. అంతేకాని నేర్పుతోఁ గోర్కెఁ దీర్పఁగల జాణలౌదురా? యని తుది యాసను వెల్లడించినది. వరగుణవిశేషములను, దన దీనస్థితినిఁ

దెలిపిననైన వారికి సానుభూతి గలుగునేమో యన్న యాశతో, చక్కదనము, జవ్వనము. జాణతనము, తేజము, పౌరుషము, సిరియు గల్గిన శ్రీకృష్ణునిపై స్థిరముగా నిలిచియున్న మనస్సు మరియొక నీచుని జేపట్టుట కిచ్చగించునే? యని హృదయమును విప్పినది. ఇది యడియాసయే గాని మీరు సహాకరింతురా! యన్న నిరాశతో "మీమాట చేయదని యింకేమియు నుల్లసము లాడక మీయిండ్లకు మీరు బోయినచో వేయి దండాలు పెట్టెద నన్నది.

ఉపకారము మాట దేవుఁడెఱుగును! వీరందఱు నూరిలో నీ విషయమును బట్టబయలు సేతురన్న భయముతో సమ్మలారా! మీ పైనున్న కూరిమి కొద్దియు, నా డెందములోని తాపము కొద్దియు మీ యందఱి యెదుటను నా వెతల వెళ్ళఁబోసికొంటిని. అయినను దీనిని రహస్యముగానే భావింపుడు. నలుగురొక్కచోటఁజేరి నా మెక్కినవ్వు కొను సందర్భములలో నన్నాడిచేసి నవ్వులపాలు చేయవలదు మిమ్ము వేడుకొందు నన్నది. ఇట్లు రసజ్ఞతయు, కోమలతయు నెఱుఁగని చెలులను సవరించుకొనువరకు నీలకు విసుగుతో పాటు తనకుఁగల యసహాయతయుఁ దోడ్పడి హృదయవేదనను మరింత బరువెక్కించినది. అయినను కృష్ణాయత్త మనస్కురాలై కోరికలూర విరహమునుసహించుచు సఖుల నొత్తిపలుకుచు నుండెను.

ఇంతలో నుద్దీపకసామగ్రితో నిండిన సాయంకాలము, చంద్రచంద్రికలు సన్నిహితము లగుటచేత గొల్లబాకన్నియ యెన్నరాని వలవంతలకు గుఱికావలసి వచ్చినది. మన్మథుఁడు వాఁడి పూములుకుల నామె వక్షమును గుఱిచేసి యదరంట నేసినాఁడు. ఆయంపజడివానసోనల యుల జడికి నామించుబోడి మిక్కిలి యెదలో నోడి మన్మథ, చంద్ర, వసంతాదుల దూషణమును బ్రారంభించినది. ఈ మదనాద్యుపాలంభనముల సందర్భమున నీలాసుందరి రాజకన్యగా వ్యవహరించినది. అందఱు కావ్యనాయికల వలెనే యుక్తాలాపములు చేసినది. అయినను దూషణములలోఁ గొంత వ్యంగ్యకౌశలము. "నిప్పాన్ని బుగ్గిగాను, నీదారతనము దుంగిపోను, నీ చేతి

విల్లు మంటంగలయక్;" అని మన్మథ దూషణము నందును, "నీసవురు సన్నముగాను; ఇంక నెన్నడు నీకు వంక గల్గదోటు;" అని చంద్రదూషణమునందును, "నీచెలు వెల్లచెట్లపాలుగా" నని వసంతుని, "నీబ్రతుకు బయల్గాను" అని మందమారుతమును, "గుల్లెక్రసేయరాకు, నీయిల్లు కూలిపోను;" అని కోయిలను, 'నీయాట యడవిఁగలియు' నని నెమలిని, నీ తుళ్ళు పెద్ద తుప్పలఁబట్ట్ "అని తుమ్మెదను తిట్టిన తిట్లు గ్రామ్య వ్యవహారమును సూచించుచు, నాయికలుఁగల గొల్లపడుచుఁదనమును గానము పాడుచున్నవి. నాగరికతా విశేషముల నెఱుఁగని గొల్లపడుచు చంద్రాద్యుపాలంభనములు చేయుట యుక్తమా? యను ప్రశ్నకు మూకీభావమును వహింతుము. కాదని బలవంతము చేసినచో గొల్లపడుచు గాదు గొల్లదొరకన్నెగదా! కొంతనాగరికత కవకాశమునొసఁగి యితరకావ్యనాయికల కక్ష్యలో నిట్టి సందర్భములందు మాత్రము చేర్చుకొనవలసినదని రసజ్ఞులకు సిఫారసు చేయుదుము.

మొదట నెకసక్కెములాడిన చెలికత్తెలే నీల మూర్ఛానిమగ్నయైనప్పుడు శైత్యోపచారములు చేసినారు. అనఁగా మూర్ఛాంతమైన విరహమునుగాని వారు విరహముగాఁ దెలిసికొనలేదన్నమాట. అప్పటికిఁగాని విషయము వారి తల కెక్కలేదు. పడిపోయిన చెలిని గాపాడఁబూనుట రస సంస్కారము లేని వారి హృదయములకుఁ దగినట్టుగానే యున్నది. అయితే వారు చేసిన శైత్యోపచారములు మాత్రము కావ్య కక్ష్యకుఁ జెందినవే కాని, చిటుకా వైద్యములు కావు. అందువలన వారికినిఁ గొంత సంస్కారము గలదనియో, నాయికానుగుణములైన యుపచారములను జేసిరనియో మనము భావింపవలసియున్నది. మన్మథ పూజలును ఇట్టి తెగకు చెందినవే. మొత్తముమీద నీ సందర్భమున గొల్లపడుచులలోఁ గొంత కృత్రిమ సంస్కార మేర్పడినదని మాత్ర మంగీకరింపక తప్పదు.

తరువాత కృష్ణుని రాక నెఱిఁగి గొల్లదొర తన యునికిపట్టుల నలంకరింపఁ జేయుటయు, కుంభకుని పురికి గొల్లలు వచ్చుటయు నందాదులతోఁ గృష్ణుఁడు వచ్చుటయు, కృష్ణుఁడు వచ్చుట తెలిసి యాఁబోతులు

విజృంభించుటయు, ఘోషవంతుఁడను గొల్లఁడు కోడెలచేఁ జిమ్మఁబడి సొమ్మసిలుటయు, కృష్ణుఁడు బలరామునితోఁ గోడెల కథను జెప్పి, వాటినిఁ బైకొని చంపుటయు, దేవాదులు మెచ్చి తత్పూచసల నెఱ పుటయు నను నంశములు గొల్లరాకొమరిత యగు నీలయు, నాపి చెలికత్తెలును జూచుచుండ జరిగిన యంశములు. శ్రీకృష్ణుని వీర శృంగార మూర్తిఁ జూచి నీల తన యుల్లములో మురిసిపోయినది. తన కోరికకు దైవఘటన యనుకూలపడినది. కోడెలను జయించుట పణముగాఁ బెట్టఁబడిన గ్రామీణ స్వయంవర మహోత్సవములోఁ గృష్ణుఁడు గెలిచినాఁడు. నీలయు ప్రేతిలమేలువాఁడు తనకు మగఁడయ్యె నని డెందమున నుబ్బిపోయినది. బ్రాహ్మణుఁడు చెప్పిన చక్కఁదన మంతయు నీలలో నిండారియుండుటఁ గాంచి యింత సౌందర్యరాశి దక్కఁగదాయని శ్రీకృష్ణుడును ఉబ్బిపోయినాడు. మనసార వలచిన నీలను ప్రేమపూర్ణదృక్కులతో నలరించినాడు.

నీలా కృష్ణులకు జరిగిన పెండ్లి గ్రామ పద్ధతిమీఁదనే నడచినది. ఒజ్జ బాపనయ్య నడిగి మూరుత మేర్పాటు చేసికొన్నారు. వధూవరులకు కాలిగోళ్లు దీసి, చమురు రాచి నలుగులు పెట్టి, నీరువోసి యలంకరించు కొని పలు తెఱఁగుల వాయిదములతోను, దివ్వటీలతోను పెండ్లి తిన్నెపైఁ దెచ్చి కూర్చొబెట్టినారు. తరువాత వివాహము క్రమముగా నారింజోతిని దర్శించువరకు జరిగినది. కుంభకుఁడల్లునికిఁ దన సంపదకుఁ దగిన కట్నములనే యిచ్చినాఁడు. అందఱికినిఁ దగిన బహుమానము లిచ్చి పెండ్లి ముగించినాడు.

పడకింటిలోనికిఁ బోవు నీలకు ముత్తైదువలు, చెలులు సామాన్య పద్ధతితోనే నీతులు గఱపినారు. నీల ముగ్ధాంగనగానే ప్రవర్తించినది. శ్రీకృష్ణుఁడు నీలను వసురాజు గిరికను రంజించినంతమృదువుగా రంజించి యానందింపఁ జేసినాఁడు. వధూవరులొక్కపైన పిమ్మట నత్తమామల యానతితోఁ గృష్ణుఁడు నీలను కుందనపు టందలములోఁ దన పల్లెకుఁ గొనిపోయినాడు. అంత నీల యింతంత యనరాని సంతసముతోఁ గృష్ణుని సేవలు చేసి ధన్యురాలైనది.

అచ్చటచ్చట రాచకళలు గన్పట్టినను నీలాసుందరి గోపికగానే వ్యవహరించినది. గొల్లదొరకన్నె యగుటవల్ల కొంత నాగరికత యామెలో స్ఫురించుట దోషముగాదు. మొత్తముమీద కూచిమంచి తిమ్మకవి సామాన్య కుటుంబములోని కన్యను నాయికనుగాఁ జేసి, తన్మూలమున గొల్లల జీవితమును, పశుసంపదను, గొల్లపడుచుల శృంగారమును కన్నులఁ గట్టినట్లు వర్ణించి యానందముఁ జేకూర్చినాఁడు.

నాగ్నజితి యని భావింపఁబడుచున్న నీల పెండిలి రుక్మిణీ కళ్యాణాదుల పిమ్మట జరుగుటయు, దానికి కోడెలను జయించుట పణముగా నుండుటయు శ్రీకృష్ణుని నాయకత్వమునకుఁ దగినవి గావని యిట్లు నందవ్రజమున నున్నప్పుడే నీలా కృష్ణుల ప్రణయమును వర్ణించి వారి నేకము చేసిన కవి ప్రశంసనీయుఁడు. హరివంశాది కావ్యములతోఁ దీనికిఁ బొత్తు కుదురకున్నను ఇది రసానుకూలమైన కల్పనమగుటచే సహృదయ హృదయ సంభావ్యముగా నున్నది.



# ప్రబంధపాత్రలు



## శుచిముఖి

### (ప్రభావతీ ప్రద్యుమ్నము)

శ్రీకృష్ణదేవరాయల 'భువనవిజయ' సభాకాయమానము కావ్య పుష్పములు పూచి దిక్కులను బరిమళింపఁ జేయుటకు మూల స్తంభములయిన అష్టదిగ్గజములలో పింగళిసూరనార్యుఁడు ఒకదిగ్గజము. రాయల యాస్థాన కవులలో నొక్కొక్క రొక్కొక్క విశిష్ట ప్రతిభా ధురంధరు లనుటలో సూరనార్యునిది కల్పనా చాతుర్యమునం దగ్రస్థానము. "ఊహించి తెలియరాకుండ సూరపరాజు శ్రమఁ గళాపూర్ణోదయము రచించె," 'కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నములు.' అన్న ప్రియోవాదములు ఈర్ష్యాజనితము లనుటలో సందియము లేదు. ఇతని ప్రతిభకు కళాపూర్ణోదయ, ప్రభావతీప్రద్యుమ్నములు గీటురాళ్ళు. ప్రభావతీప్రద్యుమ్నము కల్పితమే యైనను, గ్రంథాంతమున "అఘహారణ హరివంశ కథాశ్రియంబు, నాత్మ పుత్ర గుణ స్తవ నాంకితంబు, నైన యీ కావ్యమునకు మహా ప్రసిద్ధి నిచ్చుఁ గావుతఁ గరుణ లక్ష్మీశ్వరుండు." అని సూరనయే వ్రాసికొనియుండుటచేత నిది హరివంశమునందలి కథయని తెలియుచున్నను, హరివంశమునం దీకథ లేక పోవుటయు, దీనివంటిదే యైన 'అనిరుద్ధచరిత్ర ముండుటయుఁ గారణములుగా నిది అనిరుద్ధచరిత్ర యాధారముగాఁగల' అనల్ప కల్పనయని భావింపఁబడుచున్నది. ఈ కావ్యము సూరనకు మిక్కిలి ప్రేమాస్పదమయినది. కావుననే తన తండ్రియైన అమరామాత్యున కంకిత మిచ్చుకొన్నాఁడు.

సూరన ప్రభావతీ ప్రద్యుమ్నమునఁ బ్రవేశపెట్టిన పాత్రములలో శుచిముఖి పాత్రము నాయకమణి. ఇంచుమించుగా కథ ముగియువరకును శుచిముఖి సహాయసంపద నాయికానాయకులకు ఆవశ్యకముగానే యుండినది. సూరనకు ఈ శుచిముఖి పాత్ర కల్పనము నైషధములోని రాజహంస ప్రశంసవలన స్ఫురించియుండును. కాని నల దమయంతులను జతగూర్చిన రాజహంసకును, ప్రభావతీ ప్రద్యుమ్నుల ప్రేమలతలను అల్లువెట్టిన రాజహంసి శుచిముఖికిని మహత్తరమైన యంతర మున్నది. నైషధ హంసము స్మర వాత్స్యాయన కూచిమార కృత శాస్త్రగ్రంథ సందర్భములుపరిశీలించిన దిట్ట యయినను మేదినీశ్వర శుద్ధాంత నితంబినీ జనులకు మంద మంద గమనములను నేర్పుటయందును, దంపతులకు సారస్యము నుత్పాదించుట యందును మాత్రమే తన చాకచక్యము చూపఁగలిగినది. శుచిముఖికిఁగల అఘటన ఘటనా సామర్థ్యము దానికి లేదు. భీమ భూపాలుని యంతఃపురమువలె వజ్రనాభుని నగరు సుఖ ప్రవేశము గలది కాదు. పోతుటీఁగయు చొరరాదనుట యటుంచి, మారుతాతపములు సైతము వజ్రనాభుని యనుజ్ఞ లేక రాచనగరు చొఱరాదు. అంతఃపురమునందలి కాసారలక్ష్మికి శోభ పెట్టునవి గావున హంసలు, అందులోను ఆడుహంసలు మాత్రమే తమ యభీష్ట విహారములతో వజ్రనాభుని యంతఃపురము నలంకరించుట కతని యనుమతిని పొందినవి. అనుమతినిఁ బొందిన హంసీగణములో శుచిముఖి మేటి. కావుననే యింద్రుడు మరాళములను బిలిపించి దేవకార్యమునకు సాయపడుడని కోరినప్పుడు, శుచిముఖి వల్లభుఁడు వజ్రనాభ ప్రసంగము నెత్తి యందలి లోతుపాతులను మనవిచేయు భారమును శుచిముఖిపైఁ బెట్టెను.

శుచిముఖికి తన యపూర్వ మేధా విశేషమును విలసిల్లఁజేయుటకు చక్కని యవకాశము చిక్కినది. శత్రుపుర ప్రాంతమునం దాహారమును సంపాదించుకొనఁ బోవుచున్న మరాళములను క్షమింపుమని ముందుగా నింద్రుని కొఱ నమస్కార బాణమును వేసి తన సేవాధర్మజ్ఞతను వెల్లడించినది. అట్లు పోవుటకు, వజ్రనాభుని దుండగములలో నొకటియైన

సువర్ణాబ్జాపహారము గగన కల్లోలిని యందును. మానస, బిందుసర, సౌగంధికాది కాసారములయందును జరుగుట కారణమని చెప్పి, ఇంద్రుని యాశ్రిత రక్షణమునందలి యసహాయత్వమును సాభిప్రాయముగా బయలుపరచినది. అంత గడుసుదనము గలది కావుననే శుచిముఖికి దేవ కార్య నిర్వహణ ధురీణత శ్రీకృష్ణానుమతితో లభించినది.

ఇంద్రుఁడు హంసలద్వారా చేయింపఁదలచుకున్న శత్రు రంధ్రాన్వేషణములోని ముఖ్యభాగమును ముందే తెలిసికొని వచ్చిన శుచిముఖి మేధా సంపద, అదృష్టము ఇతరుల కబ్బునవి కావు. ప్రభు గౌరవము లభించుట కింతకన్న నేమి కావలయును? చక్కఁగా పూసగ్రుచ్చినట్లు ప్రభావతీ స్వప్న వృత్తాంతమును, చిత్రఫలక సందర్శన విశేషములను వాక్రుచ్చినది. చిత్రఫలక సమక్షమున ప్రభావతికిని ఆమె చెలికత్తె రాగవల్లరికిని జరిగిన సంభాషణమును జెప్పనెపము వెట్టి, ప్రద్యుమ్నునియందు ప్రభావతికిఁ గల గాఢానురాగమును వెల్లడించినది. ఆడఁబోయిన తీర్థమెదురైనట్లు శుచిముఖి వచ్చి తనయుపాయాన్వేషణములోని పూర్వరంగమును రచించుటవలన శచీవల్లభునికి అద్భుత ప్రమోదములు కలిగినవి. అపేక్షితప్రయోజనానుకూల్యముకంటె శుచిముఖి వచన రచనా విచక్షణత్వము చిత్తమునకు క్రొత్త యింపు సొంపును గూర్చుటచేత,

సీ॥ "శబ్ద సంస్కార మెచ్చుటను జాఱఁగనీక
పద మైత్రి యర్థ సంపదలఁ బోదల
తలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగా
పునరుక్తి దోషంబు పొంతఁబోక
ఆకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖా చంక్రమ క్రీడఁ గడవఁ జనక
ప్రకృతార్థ భావంబు పాదుకో నడుకుచు
నుపపత్తి యెందు నత్యూర్జితముగ

గీ॥ ఒకటఁ బూర్వోత్తర విరోధ మొందకుండఁ
దత్తదవయవ వాక్య తాత్పర్య భేద
ములు మహాకావ్య తాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుట బహు తపః ఫలముగాదె."

అని పొగడినాడు. "వాగ్దేవతవో! కాక ఆకె దిద్దిన కవివో!" అన్నాడు. ఇంద్రుని యనుమానమునందు కొంత సత్యమున్నది. శుచిముఖి వాగ్దేవత దిద్దిన కవియే. (కవి శబ్దమునకు పక్షి యను నర్థమును గూడ గ్రహింపవలెను. ఈ పొగడ్త సూరనకుఁ గూడ సంబంధించినదే. అధికానందపారవశ్యముగల ఇంద్రుఁడు శుచిముఖిని మెచ్చుకొనుటలోఁ దన మెప్పును, తన గొప్పదనమును స్ఫురింపజేసిన సూర్యనార్యుని ప్రతిభా విశేషము ప్రత్యంగ కల్పనా వైభవముతో విలసిల్లుచున్నది కదా!) ఆ మాటను శుచిముఖి స్వయముగా నే స్పష్టపరచినది. అందువలన దేవేంద్రుడు ఆదర విశ్వాసము లినుమడింప ప్రభావతినిఁ బ్రద్యుమ్నునికిఁ గూర్చు భారమును నీవే వహింపుమని కోరినాడు. శ్రీకృష్ణుఁడు తనను గూడ నుపాయాన్వేషము గావింపుమని చెప్పియుండుటచేత శుచిముఖి లాభ ముపాయలబ్ధిగాఁదలచి, శుచిముఖినిఁగృష్ణుని చెంతకుఁబోయి నేననిపితి నని చెప్పుమన్నాడు. శ్రీకృష్ణుని సన్నిధిలో నేను దేవకార్యమును సాధింపఁ గలనని చెప్పుకోఁగల శక్తి శుచిముఖి కున్నదని ఇంద్రుని నమ్మకము.

ద్వారకా నగరమునకుఁ బోయిన శుచిముఖి తన బలగమును దూరముగా నుంచి, తా నొక్కతెయే అష్ట మహిషీ పరివేష్టితుఁడైన శ్రీకృష్ణుని చెంతకు ధైర్యముతోఁ బోయి తన రాజాంతఃపుర ప్రవేశ మర్యాదాభిజ్ఞతను, ప్రగల్భతను ప్రకటించినది. కృష్ణుని సన్నిధికి వెళ్ళిన తోడనే అనవసర ప్రసంగములు చేయక "నన్నమర విభుఁడు పనిచె నీకొక్కమాట చెప్పంగ" నని క్లుప్తముగా వచ్చినపనిని నివేదించినది. స్త్రీల సన్నిధిలో దేవకార్య రహస్యమును బయలుపరచుటయు, రుక్మిణీదేవి యెదుట నామె కుమారుఁడు రాక్షసుని జయింపఁబోవలసి యున్నాడని తెలుపుటయుఁగార్య భంగమునకు హేతువులు కావచ్చునని శ్రీ

కృష్ణుని యేకాంతమును గోరిన శుచిముఖి ఉచితజ్ఞత నేనోళ్ళఁ బొగడఁ దగియున్నది. ఈ రహస్యమును గ్రహించుటచేతనే శ్రీకృష్ణుఁడు వెంటనే యేకాంత మిచ్చి యాదరించినాడు.

శుచిముఖి ఇంద్రుడు పిలిపించుట మొదలుకొని తాను వచ్చు వరకుఁ గల వృత్తాంతమును జెప్పుటవలన శ్రీకృష్ణునికి వడుగుల పల్కు లుపశ్రుతిగా నిశ్చయించుకొన్న కార్యపద్ధతికిఁ గడమభాగము పూర్తి యైనది. కనుకనే ప్రద్యుమ్నుఁడు వజ్రపురికి వచ్చునని చెప్పి, అతని ధైర్య సాహసములు శుచిముఖి మనస్సున కెక్కునట్లుగా "బల విభ వాభశోభితుఁ డభంగుర శౌర్య ధురంధరుండు నానా విధ మాయలుఁ దివిజ వైరులకంటెఁ గరంబు నేర్చు..." నని నచ్చఁ జెప్పినాడు. దేవ కార్యసిద్ధికి ముఖ్య సాధనమైన ప్రద్యుమ్నుఁ డెంతటివాఁడో శుచిముఖికిఁ దెలియవలయును. అనాంతర కృత్యములు, తత్తదుపాయములు నీకే తెలియును పొమ్మను శ్రీకృష్ణుని విశ్వాసమును సంపాదించిన శుచిముఖి దౌత్యకుశలత అసమానమైనది.

శుచిముఖి వజ్రపురికి బయలుదేరి ద్వారకా నగర బాహ్య ప్రదేశమునందు వాహ్యాళి చేయుచున్న ప్రద్యుమ్నుని చెంతకుఁ బోయినది. అతని వద్దకు చేరకమునుపు గగనమునుండియే యాతని యశ్వారోహణ పాండిత్యమును, అశ్వగతి ప్రభేదములు నెరిగి తత్సాయమున సౌర్యమునకుపై మెఱుఁగు తీరగల గాంభీర్యముఁగల అతని నెఱ కౌశలమును పరిశీలించినది. వజ్రనాభుని గెలువఁగల పటిమ చారిచక్రము ప్రద్యుమ్నుని కుండనలెను. శ్రీకృష్ణుని మాటవలన కొంతవరకు స్పష్టపడినను, స్వయముగాఁ జూచి మనస్సును సమాధానపరచుకొనువరకు శుచిముఖికిఁ దృప్తి లేదు. అందుకే ప్రద్యుమ్నుని వాహ్యాళి చూడఁ బోయినది.

అతని మనస్సును గుర్తెఱిగి ఇంక నీ ప్రసంగము వచ్చిన తెఱగు విన్నవించెద వినుమన్నది. ఆమాట కుతూహలలోచనుడై ఇది యేమి చెప్పునో! యనుకొనుచున్నాడు. అంతమంచి యవకాశమును గల్పించుకొని దనుజకన్యక అంతఃపురోద్యానమునందలి పొదరింటిలో చెలికత్తెతో ముచ్చటించుచుఁ దనకు సాక్షాత్కరించిన సంగతిని నివేదించినది. ప్రభావతీ సౌందర్యమును, తన శేముషీవైభవమును, దెలుపుటకుఁ దగిన యవకాశము చిక్కుటచేత,

సీ॥ "నేత్రమ్ము లనుచుఁ గ్రొన్నెల లంచు వటఫల
శ్రీలంచు తాఁబేటిచిప్ప లనుచు
అమ్ములపొదు లంచు ననఁటికంబము లంచుఁ
బులిన మంచును సుడిచెలువ మనుచు
హరిమధ్యమం బంచు హైమకుంభము లంచు
నవమృణాలము లంచుఁ జివురు లంచు
మదను శంఖ మటంచు మణిదర్పణము లంచు
బగడ మంచును దిలప్రసవ మనుచు
తే॥ శఫరు లనుచు సింగిణులంచుఁ జంద్రఖండ
మనుచు శ్రీకారము లటంచు నఖు లటంచు
నిట్టివి గదయ్య చెప్పఁబోయిన నుపమలు
వీనిఁ దడవ సిగ్గాదవు నవ్వొలఁది నెంచి."

జరిగిన కవితా వివాదమందు తాను వాసి యగుటచే "ఉపమాతిశయోక్తి కామధేను" బిరుదము, అది వ్రాయఁబడిన గండపెండేరము తనకు లభించుట మొదలైన విషయములను దెలిపినది. ప్రద్యుమ్నునికి ప్రభావతిమీద వినుకలిచేతనే యనురాగము కలుగవలయును. కావున అంత సుదీర్ఘముగాఁ బ్రభావతీ సౌందర్య వర్ణనము గావించినది. ఆ చేసిన వర్ణనమునందును, చేయఁబోవు దౌత్యమునందును ప్రద్యుమ్నునికి విశ్వాసము కలుగుటకే తన వంశగౌరవమును, తన విదుషీత్వమును తన బిరుదమును దెలుపుటకుఁబూనుకొన్నది. అవసరమెంతో అంతే కాని అధికప్రసంగము చేయని శుచిముఖి యీ దీర్ఘోపన్యాసమునం దెన్నియో రహస్యము లిమిడియున్నవి. ప్రభావతీచిత్రమును వ్రాయ బూనినచో, ప్రతి యంగమును భావన చేసిగాని వ్రాయ వీలులేదనియు, భావనచేసినచో ఆనందపారవశ్యము గలుగును గనుక పరవశతతో వ్రాయుట అసలే సాధ్యము గాదనియుఁ జెప్పినది. ఆమె రూపమును చిత్తరువున వ్రాయఁగలిగియున్నచో బ్రహ్మ మరొక్కదానిని తత్తుల్య వనితను సృజించియుండుననియు, అసలు ప్రభావతి బ్రహ్మ సృష్టి కానే కాదనియుఁ జెప్పి, యిక మిక్కిలి తడయుట యుచితముగాదు పోయి వచ్చెదనని తోడియంచలతో వజ్రపురికిఁ బోయినది. శుచిముఖి మాటల సొంపులో ప్రద్యుమ్నుడు వజ్రపురీ ప్రవేశోపాయమునడుగ మరచి నాడు. అట్లు మరపించిపోవుటయే అప్పటికి శుచిముఖికిఁ గావలసినది. అభీష్ట వస్తువు దూరముగానుండి దానిని సాధించు నుపాయము సరిగా తెలియనప్పుడే దాని ప్రభావము హృదయముపై చక్కగా పడుట కవకాశము గలుగును. ప్రద్యుమ్నుని యభిలాష విప్రలంభము నుద్దీపింపఁ జేయుటకే శుచిముఖి యీ యెత్తు వేసినది. అది చక్కగా ఫలించినది. ప్రద్యుమ్నుడు ప్రభావతీవిరహమును సహింపలేక శుచిముఖి మరియొకమాటు కనఁబడినచో బాగుండు ననుకొన్నాఁడు. భావనాబలముతో ఘటితమైన ప్రభావతీ మధురాకృతి అతనిని పెట్టని చిక్కు లేదు. తుదకు "కామార్తాహి ప్రకృతి కృపణా శ్చేతనాచేతనేషు" న్నంత దశకు వచ్చి, "కృప నెటిగింపరే కీరోత్తమములార వజ్రి

పురికిఁ బోవువారె మీరు" అని వాపోయినాఁడు. అతఁడిట్టి దశకు వచ్చుటకు ప్రభావతీ రుచిర రూప బ్రహ్మమును శుచిముఖి వాగుపనిషత్సిద్ధాంత మార్గములలో పలుమారు మననము చేయుటచేఁ జిత్తము తదేకాయత్తమగుటయే కారణము. ఇఁక ప్రియురాలి దర్శనము దప్ప నతనికి శరణ్యము లేదు. ఇట్టి యసహాయ స్థితియందు దైవికముగా వచ్చి వజ్రపురికిఁ బోనున్న ఒక చిలుక యతనికిఁ బ్రియాదర్శన భాగ్యమును లభింపఁ జేయుటకు సిద్ధాంజన గుటిక యైనది. కంతు సంతాప పారవశ్యములో "ప ప్ర భా భా వతి" అని యదవదగా వ్రాసిన ఉత్తరమును, ఆ చిలుక రెక్కలలో పొదిగికట్టి శుచిముఖికిఁ బంపినాడు. ఈ సన్నివేశము వలన శుచిముఖి ప్రద్యుమ్ను లుభయులకును నవసరములు తీరినవి. ఇదంతయు శుచిముఖి పురుషకారమునకు దైవము తోడ్పడుట వంటిది.

ప్రద్యుమ్నుని వీడ్కొని వజ్రపురికిఁ బోయిన శుచిముఖి, అందున్న కన్యాంతఃపుర సౌధ ప్రాంతములలోఁ దన విడిదిఁ గావించుకొన్నది. ఊరక యెన్నాళ్లుండినను గార్యసిద్ధి చేకూరదు. కనుక అంతఃపుర కన్యల మచ్చికను, ప్రభావతి స్నేహమును సంపాదింపవలయును. దానికై జలక్రీడ సలుపు కన్యల కలకలమునకు మిక్కిలి దవ్వువాఱక నిలిచి నిలిచి, వారొకరొకరిపైఁ జల్లుకొను జలబిందువులు తనమొడలు సోకిన దూరముగాఁ బోక ఓర్చి యోర్చి, వారి హస్తములందలి లీలాబ్జ కేసరములను పసిగొనుచు మలసి మసలి, క్రమముగా నంతఃపుర కాంతలకు బెదరక చేరికల యందు చరించుటకు నలవాటు చేసుకొన్నది. ఇఁక మిగిలియున్నది ప్రభావతి నేస్తము.

శర్వాణి స్వప్నమున వచ్చి చిత్ర ఫలకము నిచ్చిపోయినదాదిగా నట్టి మనోహరాకారుఁ డెందున్నాఁడు ? ఎట్లు లభించును ? ఏది యుపాయము ? అని యుత్కంఠతో నున్న ప్రభావతికి చిత్రగత యువక సౌందర్యము విరహవ్యథను గలిగించినది. కంతు సంతాపమునకు గురియైన ఆ గరితకు చిత్రఫలక సందర్శనము తప్ప మనశ్శాంతి నిడు వస్తువు మఱొక్కటి లేదు. అదియును దెప్పించి యొద్ద నుంచుకొనువరకే

భావనా బలముచే బ్రహ్మా సౌందర్య రస పారవశ్యము గలిగెనా చిత్ర ఫలక మంతటి మనోవేదనను బుట్టించు వస్తు వింకొకటి లేదు. ఇట్లు విరహవేదన ననుభవించు ప్రభావతి అంబ కరుణను శంకించుచు, ఇట్టి పురుషుఁడు ప్రపంచమున నుండునా? అని పలువిధముల రాగవల్లరి యెదుట విచారపడుచు, తాప పడుచు, చెలిచేయు శైత్యోపచారములు వృథపరుచుచు జీవిత సంశయ దశయందున్న యదనును గనిపట్టి శుచి ముఖి యదృచ్ఛతోవలె నిటునటు పలుమారు దిరుగుచు చిత్రఫలకము వంకఁ జూచుచుండెను. ప్రభావతి యీ వింతనుఁజూచి రాగవల్లరితో "ఈ హంసి యేమెఱుఁగునో తిరిగి తిరిగి చిత్రఫలకమును జూచుచున్న"దని యుల్లసములాడు సమయమున తన మృదుమధురోక్తితోఁ ప్రసంగమును ప్రారంభించినది. ఇంత యవకాశము దొరికిననేగాని శుచిముఖి తనహృదయమును బయటఁ బెట్టదు.

తా నింతకుముం దట్టి పురుషునిఁ జూచియుంటి నని చెప్పి ప్రభావతికి నద్భుత ప్రమోద సందేహములు గలిగించినది. "ఇంతవర కేల చెప్పకుంటివి? మా భావమును గ్రహింపలేవా? నీకు భయమేల" యని ప్రశ్నించి నప్పుడు, ఆకృతిచేతనే నేను పరేంగితజ్ఞులను దెలియఁగలనుగానీ "పిలువని యే వెఱ్ఱినే చేర నిరువు రేకతమాడఁగ" అని తెలిసి తన యుచితజ్ఞతను ప్రకటించినది. వారాదరించి, అనునయించి, గౌరవముతో మా సందియమును దీర్పుమని వేడినప్పుడు వింత నటనమును కొంత నడపి 'అవు నతఁడితఁడే' యని చెప్పినది. అప్పటికిని సంశయించుచున్న ప్రభావతినిఁజూచి,

"ఉ॥ ఆరయ వింక నే మడిగె దల్లవె యాతఁడు శంబరుం డిరులో
కారిని ద్రుంచునప్పటి ప్రహారకిణంబు లురంబునందు; నా
హా! రతి కంకణాంకములు నల్లవిగో మెడయందు; వీర శృం
గార కళాఢ్యు డిట్లతని గట్టిగ నెవ్వ తెఱింగి వ్రాసెరో!"

అని స్పష్టపరచినది. దానితో నిట్టి పురుషుఁడు జగత్తున లేఁడను ప్రభావతి పందెమోడిపోయి కలఁడను రాగవల్లరి పందెము గెలిచినది.

"ఈ పురుషుని యగ్ర్యాని కథనము చేయుట అంతఃపుర కాంతలైన మీ యెదుట లగ్గుగాదు. మీ సందేశములు గెలుచుట కింతమాత్రము చాలును. పోయివచ్చెద"నని చెప్పి తన మితభాషిణీత్వమును వెల్లడించి, వారి కుతూహలమును పెంచి యూరకున్నది. గిల్లి జగడమునకు రాకు మన్నట్లు రేకెత్తించి, యూరకుండు మన్న వారూరకుందురా? "పోయె పోయెదనంచి ట్లో యాచలతల్లి యేల యుద్ఘాటింపగ" అని ప్రార్థించి నీ యునికి మా యేకాంతపుం బనికి విరోధి కాక పోగా నిర్వాహకము కావచ్చును ఉండు మన్నారు. విన్న మాటలలో గెలుచుట దుర్లభము. అతని యన్వయాదికమును జెప్పి యనుగ్రహింపు మని వేడుకొన్నారు.

అంతగా వేడుకొన్న పిమ్మటగాని శుచిముఖి ప్రద్యుమ్నుని పుట్టు పూర్వోత్తరములు చెప్పలేదు. ఇంత బింకము ఇంత యుచితజ్ఞత యుండుటచేతనే రాగవల్లరి వంత కెళ్ళంబోసి "ఓ విహంగమ పురంధ్రీ! యింక నీచేత నున్నదీయింతి బ్రతుకు" అని బ్రతిమాలవలసి వచ్చినది. ప్రద్యుమ్నునికిం దా నింతకు మున్నే చిత్రఫలక వృత్తాంతమును, ప్రభావతీ ప్రేమాంకూర వికాసమును దెలిపియుంటి ననియు, దాని కతండు ప్రత్యుత్తర మేమియు నీయలేదనియుం జెప్పి ప్రభావతి మనస్సును కలవరపరచినది! "అతివా! విన్నవించు వేళం బ్రతివాక్యంబేమియు నేనిం దగ్రతి కాంతున్ వెసం దెత్తు పంపుమని పంతంబాడుకోరాదు." కాని సిద్ధ గంధర్వ దైవత దైత్యాది కులములయందు నీవెవ్వనిగోరిన వానిని దెత్తునని సానుభూతిని వెల్లడించుటలోని మర్మము. 'ఇగతుల తాల్మికల్మి వాతావిలపల్లవాంచలహిమాంబుకణములకంటె క్షణభంగురము' గనుక ప్రభావతికిం బ్రద్యుమ్నునిపైంగల దృఢానురాగమును బరిశీలించుటతప్ప మరేమైయుండును? ఆ పరీక్షలో ప్రభావతి కృతార్థురాలయినమీదటనే తరువాతి కథను నడిపించినది.

ప్రద్యుమ్నుని యుత్తరమును దెచ్చిన చిలుక యురిలోం దగుల్కొని, ప్రభావతి యురిని విడిపించి పొదివి పట్టుకొనంబోవునంతలో నెగిరిపోవుట [illegible]దైవ ఘటన. ఉత్తరము జారి క్రిందపడినది. ఉత్తరములో ప్ర[illegible]

వలసియున్నను అపరాధినిఁ బట్టుకొని ప్రభావతి మనస్సున కెక్కుటకై శుచిముఖి దాని వెంటఁ బడినది,

ఈ తంత్రములో, వరోత్తమునఁ దనయుత్తరమనువారు చదువుకొనవలయును. తాను చిలుక గుట్టును దెలిసికొని యనంతర కథను సాగించవలయును. ఇది శుచిముఖి యుద్దేశము. చిలుక బేలతనముతో వజ్రనాభుని సోదర తనయలైన చంద్రవతీ గుణవతులు, ప్రద్యుమ్నుని సోదరులైన గద సాంబులను ప్రేమించి యుండుట బయలుపడినది. దీనితో ప్రద్యుమ్నుఁడు సపరివారముగా భదనటరూపముతో వజ్రపురికి వచ్చు నుపాయము పూర్తియైనది. ఈ రహస్యముల నన్నిటిని పుక్కిటఁ బట్టుకొని, ప్రభావతిని తండ్రియెదుట భద్రనట ప్రసంగముఁ దెచ్చి తన విశేషజ్ఞతను, లోక సంచార కుశలతను దెలిపి, తనను బ్రవేశ పెట్టుమని కోరినది. అపారమైన తన శాస్త్రపాండిత్యమును, లోకజ్ఞతను సభాముఖమున బ్రకటించి వజ్రనాభుని యాదరాభిమానములను జూరగొన్నది.

పూర్వరంగమంతయు సిద్ధపడినపిమ్మట రెండవసారి ప్రద్యుమ్నుని చెంతకుఁబోయి ప్రభావతి యనురాగ పరాకాష్ఠను దెలిపి, గద సాంబ ప్రద్యుమ్నులొకరి ప్రేమ రహస్య మొకరికి దెలియక, కేవలము పితాజ్ఞతో వజ్రపురికి వచ్చునట్లుగనే యుత్సాహముతో వచ్చునట్లు రహస్య గోపనము చేసిన శుచిముఖి మేధా విలసన మసమానమైనది. లోక కంటకుడై అమరాధిపతి యంత వానిని ముప్పు తిప్పలబెట్టి శ్రీకృష్ణునికి సైతే మూహింపరాని విజయోపాయముగల వజ్రనాభుని యంతఃపురములో ముగ్గురు కన్యల ప్రేమ రహస్యములను గాపాడి విజయవంతములను జేయుట కెంత మేధాశాలియైన దూతి కావలయును? చిలుకవలె నవివేకముగాఁ బ్రవర్తించినచో, ఈ నాయికా నాయకుల ముజ్జంటలో బ్రతుకఁగలవారొక్కరును లేరు. బృహస్పతికిఁగూడ తోచని మంత్రశక్తి శుచిముఖిలో నుండుటచేతనే కార్యరంగమున శుచిముఖి ప్రవేశింపగనే ఇంద్రోపేంద్రులు తప్పుకొనిరి. ప్రద్యుమ్నుని వజ్రపుర వాసములో

అంతఃపుర ప్రవేశమునకు శుచిముఖి చేసిన దౌత్యము, గదసాంబులకుఁ జూపిన ప్రియాసమాగమోపాయములు అనితర సాధారణములు. పగటివేళల వజ్రనాభుని, రాత్రిళ్ళయందు ప్రియురాండ్రను తనియించిన గద సాంబ ప్రద్యుమ్ను లెంతగా శుచిముఖిని ప్రశంసించి యుండిరో యూహించుట కెవ్వరికిఁదరము ?

అంతఃపుర పరికల్పితమైన ప్రభావతీ ప్రద్యుమ్న సమాగమోపాయము పూర్తియైన పిమ్మట వారి గాంధర్వ వివాహవిధికి ప్రద్యుమ్నుని ప్రార్థనమువిూదనే రాగవల్లరీ సహితముగా తాను పెండ్లిపెద్దయగుట కంగీకరించినది. కనుకనే నాయికా నాయకులకు ప్రథమ సమాగమమునఁ గలిగిన పొలయలుకలను దొలగించుటలో చెరిరెండు వడ్డించి బుద్ధులు చెప్పఁగలిగినది. ఇట్లు వజ్రనాభ వధోపాయములు పూర్తి చేసిఁ ప్రభావతీ ప్రద్యుమ్నుల ప్రేమలతలను ఒకపందిరికి నల్లువెట్టి, వారుగాని ఇంద్ర శ్రీకృష్ణులుగాని, చదువరులుగాని తనను స్మరింప నవసరములేనంతగాఁదనవిధిని నెరవేర్చి యదృశ్యయైన శుచిముఖి శుచిప్రవర్తనము, సర్వతంత్రస్వతంత్రత, అసమాన ప్రజ్ఞాధురీణత సహృదయహృదయ ధ్యేయములై మెచ్చఁదగియున్నవి.

శుచిముఖి పాత్రము నందీవిధముగా శాస్త్రపరిశ్రమను, రాజకీయ కార్యధురీణతను, సమయోచిత సంభాషణ చణత్వమును, కార్యసంధాన కుశలతను, స్వామిభక్తిని, వినయ విధేయతలను, శత్రువిజయ వ్యూహ రచనాశక్తిని. వస్తుపరిశీలనాపటిమను, మితభాషిత్వమును, సర్వజ్ఞతను, పాత్రములను గత్తివిూద నడిపింపఁగల జాగరూకతను, చతుర వచన రచనాధురంధరత్వమును గూర్పఁగలిగినపింగళి సూరనార్యుఁడేయుబ్బిపోయి,

చం॥ "శుచిముఖియండ్రు దానిని వచోనిపుణత్వమునందు సత్కథా
రచనలయందు నీతివిధురత్వమునందు బహుశ్రవావలో
కచణతయందు నెందుసరిగానము దానికి వేయునేల చా
నిచతురతా విశేషములు నీవెఱుఁగ వలయుఁగా మహాత్మకా"

అని పొగడి శుచిముఖి పాత్రసంధాన కౌశలమును నెఱుఁగు భారము నితరులమీాదనే వదలినాడు. ఓపినకొలది వ్రాయఁగలిగిన నేను రసజ్ఞులమీాదనే యీ భారమును వదలుచున్నాను.



# ప్రబంధపాత్రలు



## పాండురంగ మాహాత్మ్యము - అందలిపాత్రలు

(నిగమశర్మ, అతని అక్క)

రామకృష్ణకవి బాలబాలికలకును, పల్లెటూరి పెద్దలకును, ప్రతిదిన తాత్కాలికథా సందర్భములందును జ్ఞప్తికివచ్చు తెనాలి రామలింగఁడే.

కొందఱు చారిత్రికవిమర్శకులు రామలింగఁడు వేరనియు, రామకృష్ణుఁడు వేరనియు నిర్ణయించినారు ఎవ్వరికిని సరియైనయాధారములు చిక్కలేదు. కవితాశైలి భిన్నముగానుండుట, శివకేశవభక్తి, కారణములందురు. కొందఱు రామకృష్ణకవి రాయలకాలమువాఁడు కాదు. అగుచోఁ దనకావ్యమును రాయలకంకిత మీయకుండునా? యందురు! చరిత్రనిర్ణయమునఁ గవితాశైలిని, కవిభక్తినిఁ బ్రమాణములుగా గ్రహించుట ప్రమాదకరము. కవుల శైలి కాలవిలంబముచేతను, అనుభవాబ్ధిచేతను మారుచుండును. ఏకధారావాహిగా నున్న కావ్యములు సైతమక్కడక్కడ భిన్నమార్గములలో నడుగు పెట్టుచుండుట సాహితీపరులకుఁ దెలియని యంశముగాదు. శైవవైష్ణవభక్తి ప్రపత్తులు పోతనవంటి వారిలోనే వ్యభిచరించినప్పుడు కవికి బాల్యమునుండి వార్ధక్యము వరకు నొకేదైవముపై భావము నిరూఢమై యుండి. యితరదైవస్తవమున కతని గంటము సాగదనుట సత్యమనిపించదు. మతప్రచారకులైన వారలకు సోమనాథుఁడు మొదలయిన వారికిఁదప్ప, సద్యశపకనిర్వృతినిఁ గావ్యలక్ష్యముగాఁ బెట్టుకొన్న కవుల కట్టినియమ ముండుట సహజము గాదు. కాగా రామకృష్ణుఁడు వైష్ణవుఁడు గావున నతఁడు రామలింగఁడై యుండడను మాట సత్యదూరము. రామలింగకవి చేసినకొన్ని పదప్రయోగ

ములు రామకృష్ణునివే. శైవ వైష్ణవ పురాణార్థవిదుఁడనని చెప్పుకొని పాండురంగ మహాత్మ్యమున శివస్తుతిని, పార్వతీస్తవమును జేసిన రామకృష్ణుని కేవల వైష్ణవుఁడనుట సాహసమగును. అబ్జాంకఁదర్ప కేతువిలాస, హరిలీలా విలాసములను రచించిన రామలింగకవియు, కేవల శైవుఁడు కానేరఁడుగదా! కనుక మతప్రియుక్తమైన తారతమ్యమిచ్చట పొసగ నేరదు.

ఇఁక రాయలకాలమువాఁడు గాఁడను మాటయు బూటకమే. తెనాలి రామలింగనిపైఁగల కథలన్నియు రాయల యాశ్రితత్వమును సూచించుచునే యున్నవి. రామకృష్ణుఁడు ( రామలింగఁడు ) అల్లసాని పెద్దన్న మొదలగువారి నాక్షేపించినట్లును, కొన్ని సందర్భములందు సభాగౌరవార్థమై కాపాడినట్లును కథలున్నవి. భట్టుమూర్తిని నీకవిత్వము చేపలబుట్ట వంటిదని తిట్టినట్లు పద్యమేయున్నది తాతంభట్టును పరిహసించినట్లు చెప్పుకొందురు. ధూర్జటిని దుయ్యబట్టిన పద్యమేయున్నది. ఇంతయును ప్రసిద్ధమైన 'అష్టదిగ్గజ' పదవ్యవహారము రామకృష్ణునివల్లనే పలుమార్లు నిర్వహింపఁబడినట్లు పరంపరఁగాఁ జెప్పుకొనుచున్నాము. ఇవన్నియుఁ గల్పితములని త్రోసివేయువారు సరియైన యాధారములను జూపునాఁడు మన యభిప్రాయమును మార్చుకొను పద్ధతితో నిప్పటికి రామకృష్ణుఁడు బాల్యమున రామలింగడనియు, వార్ధక్యమున రామకృష్ణుఁడనియు సిద్ధాంతీకరించుకొందుము.

ఆంధ్ర వాఙ్మయచరిత్ర సంగ్రహకారుని మతమిదియే. అదే సమంజసముగా నున్నట్లుగోచరించుచున్నది. "మధ్వవైష్ణవమనే" సామెత గూడా ఇట్టి వ్యక్తులను సమర్థించుచున్నది. కనుక బాల్యమునను, యౌవనమునను రామలింగకవిగా నుండి, వైష్ణవభక్తి ముదురుటచే రామకృష్ణుఁడుగా మారి పాండురంగమహాత్మ్యమును రచించియుండుననన్న కొందరు చారిత్రకుల సరణి ననుసరించుటయే యుక్తతరము.

రాయలకాలమునఁ జిన్నవాఁడగుటచేతను, హాస్యకవితా ప్రసంగముల చేతఁ గాలము గడుపుచుండుటచేతను, రాయలు పెద్దనాదులకే

యగ్రతాంబూలము నొసఁగి కృతిస్వీకారమున కిచ్చగించి యుండుట చేతను, అల్పకాలములోనే రాయలు దివంగతుఁడగుట చేతను రామకృష్ణుని కవితావామాంగికి రాయల పాణిగ్రహణ భాగ్యము లభింపక పోవుట వింతగాదు. మీఁదుమిక్కిలి పాండురంగ మహాత్మ్యము నందలి ప్రౌఢిని, పద్యముల పోకడను, వక్రోక్తి చాతుర్యమును, గడుసుఁదనమును, కుటిల కుత్సిత విన్యాస భంగిమలను బరికించినచో, చిన్ననాటి కొంటెభాగవతుఁడైన రామలింగఁడే నేటివక్రోక్తి చతురుఁడైన రామకృష్ణకవి యని కావ్యమర్మజ్ఞుల కంతిసాక్ష్యము దొరుకకపోదు. కావున రామలింగ రామకృష్ణు లభిన్నులని యే విశ్వసింతము.

పాండురంగ మహాత్మ్యమునకు కృతిభర్తయైన విరూరి వేదాద్రి మంత్రి శ్రీరంగపట్టణాధిపతియై, గురవరాజు పుత్రుఁడైన పెదసంగ భూపాలుని వ్రాయసకాఁడు. అతని వ్రాయసము (లేఖనము) ను గురించి పీఠికలో "పట్టెపట్టియను బగిపుష్టి తలకట్టు" నని యొక్క సీసపద్యమునే రామకృష్ణుఁడు వ్రాసినాఁడు. వేదాద్రిమంత్రి కుల శేఖరుఁడైనను మంచివ్రాయసకాఁడు. అనగా నతని యుద్యోగమదియే యన్నమాట. అయినను గౌరవమునకుఁ గాని యైశ్వర్యమునకుఁ గాని కొరత లేదు. సంపన్నుఁడు, విరూరు గ్రామాధిపతి, ధార్మికుఁడు, విష్ణుభక్తుఁడు, దాత కనుకనే రామకృష్ణుని కావ్యమున కధినేత యైనాఁడు.

దాతయైన విరూరి వేదాద్రి "ఉదయం బస్తనగంబు సేతువు హిమవ్యూహాంబునున్ జుట్టిరా విదితంబైన" మహిలో మహాంధ్రకవితా విద్యాబలప్రౌఢియందు రామకృష్ణుని కెదురైన కవిని గనలేకపోయినాఁడు: కనుకనే యతనిని "సరసార్థబోధఘటనా హేలావగాహా ప్రకాశారద నీరూపము రామకృష్ణకవిచంద్రా! సాంద్రకీర్తీశ్వరా!" యని స్తుతించి కవిప్రింపు పలుకులలోఁ గూడిన వీడియమునిచ్చి కృతిరచింపుమన్నాఁడు. ఈ కృతి మహోదయ కాలము క్రీ. శ. 1565. తరువాతనే (అనగా రాయలయనంతరమే) యని చారిత్రికుల నిర్ణయము. కనుకనే

వేదాద్రి) యదృష్టము పండినది. పాండురంగ మహాత్మ్య కృతిపతిత్వము లభించినది.

"పాండురంగ సుకవిపద్యంబు హరువు" సామాన్యమైన కొలబద్ద కందునదికాదు. ఒక్క పదగుంభనలతోనే తక్కిన కావ్యములను త్రొక్కిపట్టినది. "అవురా! కవిత్వమిటులుండవలెఁ" అని పెదవిఁ గొరికించినది. ఆంధ్ర పంచకావ్యములలో నగ్రతాంబూలము పాండురంగ మహాత్మ్యముననే సమర్పించు కొనవలసినట్లుగా కావ్యజ్ఞులను కట్టివేసినది. (శృంగారనైషధము, మనుచరిత్రము, ఆముక్తమాల్యద, వసుచరిత్ర, పాండురంగమహాత్మ్యము, ఆంధ్రపంచకావ్యములుగా నెన్నబడినవి. ఈ వరుసలో సోపాన పరంపరవలె ఉత్తరోత్తరములు ప్రౌఢకావ్యములు.) సంస్కృత పంచకావ్యములలో "మాఘేసంతిత్రయోగుణాః" అన్నకీర్తికి శిశుపాలవధ కావ్యము గురియైనట్లు తెలుగుకావ్యములందలి సర్వగుణములును పాండురంగ మహాత్మ్యమునందు ప్రతిఫలించి "పాండురంగ సుకవిపద్యంబు హరువు" అనుమాట పుట్టుటకుఁ గారణమైనది. ఈకావ్యమునందుఁ గావ్య, ప్రబంధ, పురాణరీతులు మూడును, నిండుగా నెండుకొనియున్నవి. కథను బరిశీలించితిమేని యది పౌరాణికము. కవితా శక్తి కాశీఖండాదులను స్మరింపఁజేయును: వర్ణనలు ప్రబంధధోరణిలో సమగ్రముగా నడచినవి. కాశీపుర వర్ణనముతో నారంభింపఁబడిన యీ కావ్యము అయుతనియుతులను ముని కుమారుల చరిత్రముతో ముగియుచున్నది. మధ్యలో పెక్కుకథలు సుందరముగా చిత్రింపఁబడినవి (కాశీపుర వర్ణనము. అగస్త్యుఁడు పాములకుఁ బోవుట, కుమారస్వామి రజతగిరికి చనుట. పుండరీక స్థలమహిమ, పుండరీకుని చరిత్రము, నిగమశర్మోపాఖ్యానము, తీర్థములప్రభావము, కృష్ణావతార చరిత్ర, రాధాదేవి చరిత్రము, కాకి, పాము, హంస, చిలుక, తేనెటీగ ఆవుల చరిత్ర, సుశీలచరిత్ర, ధర్మరాజు పాండురంగ క్షేత్రమునకుఁ బోవుట, సుశర్మోపాఖ్యానము, అయుతనియుతులచరిత్ర.) అందు నిగమశర్మోపాఖ్యానము మకుటాయమానమైనది. రామకృష్ణునియగ్రహారానుభవములు,

తెలుగుఁదనపు మొలకునవ్వు, పాత్రచిత్రణ చతురిమ, సంభాషణ చాతుర్యము, సంప్రదాయ వేదిత్వము ఇదియది యని చెప్ప నేల కవితా సర్వస్వమంతయు, కవిసామర్థ్యమెల్లయు దీనియందు ప్రతిబింబించినది.

రామకృష్ణుని కవితాసామగ్రియే విభిన్నమైనది. పదసందర్భముల నడుకుటలో నతనిదే యగ్రతాంబూలము. ఆపదములును బహువిలక్షణములైనవి. చూడుడు. "వేదముల్ వ్రాసినగాదె, చంద్రుని పెన్నుద్ది, మీను మీసమువంటి యొంటిజందెము, తాళిగోణపుఁజుంగు, పీటిప్రోగు, వంకరపరకచాలు, గువ్వగుత్తుక తోడక, పిల్లిశీలము, నేలలోవెడలని తమ్మిగుజ్జులు, పిలుపిచ్చవిద్యలు, జగనీలిపిపాళిజంత. ఇట్టివెన్నైని చూపవచ్చును. సంస్కృత పదములనుగాని, సంస్కృత సమాసములనుగాని వాడుచోఁ దనసంస్కృత భాషాపరిచితి యసాధారణమని స్ఫురింపఁ జేయుటకై "విభ్రాంకిత్రియా సాధుత్వంబు. ఉత్కోచుండు వాచాలతన్, తార్తీయపురుషార్థము, అవఘనంబు, చతుర్గాజీనయుగంబు, అత్రికాభర్త, ఉద్గనుసీయంబు. దురాసదులు, పతియాళునగుబొంది, పురస్సరద్భర్యముగా" వంటి వెన్నియో ప్రయోగించినాఁడు. ఇఁక జాతీయములమాటఁ దడవితిమా "చదువుసంధ్యలు, చదువుసంత, ఇందుగీసినరీతి, గడుసువడి, గుడ్డవృత్తులు. కుత్తచేలు, చీమవలెఁగూడబెట్టి, నేతిబీఅకాయ, అంటుసఁటులు, బంటుబైద" మొదలైనవాని నెన్నింటినో కుప్పవోసినాడు. రసప్రసంగమునకు వత్తుమేని బింకము చెడక ధైర్యము విడక భక్తిశృంగారములను చక్కఁగా సముల్లసింపఁ జేసినాఁడు. వానికిఁగావలసిన యంగప్రత్యంగ సామగ్రిని చక్కఁగా సమకూర్చి పొదిగినాడు. కవిని, కావ్యవస్తువును, కవితాసామగ్రిని యర్థము చేసికొని శాంతముగా నర్థములు, భావములు, రసములు గ్రహించి యానందమనుభవింపవలయునేగాని తొందరపడి పైపైఁజదివి పాత్రమును గిరాటు వేయఁజూచితిమా రామకృష్ణుడు తాతంభట్టువలె వెక్కిరించును, భట్టుమూర్తివలె తిట్టి మాట్లాడును. నరసకవివలె కొట్టవచ్చును. అట్లుగాక విధేయులై చదువుకొనువారికి వివిధమైన యానందమును ప్రసాదించును. రామకృష్ణుని కవితామాధుర్యముఁ గ్రోలఁదలచిన వారికొక్క నిగమ

శర్మోపాఖ్యానమే చాలును. అందే రసజ్ఞుల కన్నులకు మిఱుమిట్లుగొల్పు జాతిరత్నము లెన్నియో సానలఁదీరి మెఱయుచున్నవి.

నిగమశర్మోపాఖ్యానము క్షేత్రప్రభావమువలన నొక పతితునికి మోక్ష మబ్బిన విషయమును దెల్పుటకుఁ బుట్టిన దైనను దానిని కవి తెలుఁగు దేశమునకు సమన్వయించుటచేత నెక్కడలేని యందము చేకూరినది. సంపన్నమై, ధార్మికమై, చేయి మీఁదుగా నడచిన యొక బ్రాహ్మణ కుటుంబము, దానియందొక స్వచ్ఛంద వృత్తిగల యువకుఁడు పుట్టుట, హద్దులు మీరిన యతని దుర్విదగ్ధత, అడుపడుచు కాపురమును సరిదిద్దవలసి వచ్చుట, విధివిలాస వైచిత్రియిందు ప్రధానాంశములు. నిగమశర్మ దుశ్చరితము మూలమునఁ బ్రసక్తికివచ్చిన జానపదాగ్రగామియైన రెడ్డి దయాళుత్వము, అతని యింటిలో జగసీలిపినాళిజంతగా నున్న వికారపుఁ గోడలి దుర్వృత్తి, ఆ పంటదాని పయనమునకై యేర్పడిన గాలిగంగల జాతర, ఆ విటీవిటుల యునికికై వచ్చిన పక్కణము (చెంచుపల్లె) కాఁపు గొంజిగురాకుఁబోఁడి పరలోకమును బ్రాపించుటతో నిగమశర్మ యొంటితనమును బాపుటకై వచ్చిన రూపాజీవరాజానన యగు ప్లవకన్య (మాలబోగముది), ఆ కడజాతినాతి ససంతానముగా నిల్లంటుకొని చచ్చుటచేతఁ బిచ్చియెక్కిన నిగమశర్మ గంతవ్యస్థానము లేక జనరహిత మహియందుఁ జొరుటయును నంశములు కథకుఁ, గావ్యమునకు వన్నెలు దిద్దుట కేర్పడిన జాతి రత్నములు. వీనివల్లనే నిగమశర్మోపాఖ్యానమున కంత ప్రాముఖ్యము వచ్చినది.

## నిగమశర్మ

ఇతఁడాంధ్రదేశమునందలి సంపన్న వైదిక కుటుంబమునకుఁ జెందిన ధూర్తయువకునికిఁ బ్రతిబింబము. ఇతని ధూర్తత్వము హద్దులు మీరి క్షేత్ర ప్రభావ గౌరవమును గొంతవరకుఁ గుంచితముఁ జేసినది. విప్రకుమారుఁ డెంత ధూర్తుఁ డైనను నిగమశర్మ చేసినన్ని యత్యాచారములు చేయునా యనిపించును. కాని అట్టి మహానుభావులు లేరని మాత్రము గట్టిగాఁ జెప్పఁజాలము. సత్య మెట్లున్నను కవి యతనిలోఁ దెలుఁ

గుండనఁపు నెఱగొంటు తనమును జక్కఁగా నచ్చు గుద్దినాఁడు. నిగమశర్మకుఁ దనతోడి ధూర్తవిట బృందమును మెప్పించుటకుఁ గావలసిన గుణము లన్నియు నున్నవి.

దైనందిన కృత్యములుగా నభ్యంగము, అంగమర్దనము, ఫెళఫెళ లాడు ధౌత వస్త్రధారణము, సంస్కృతోజ్జ్వల కలమాన్న భోజనము, చందనచర్చ, పూలదండలు సిగలోఁ దురుముకొనుట, కర్పూర తాంబూలము, సొమ్ముల కైసేఁత గలిగి పులుగడిగినముత్తెమువలె ముస్తాబై మీనుమీసమువంటి యొంటిజందెముతో, తాళిగోణపుఁ జుంగు నేల జీరాడగా, యువతీ నఖక్షతాంకములతో నగరఘంటా పథమునందు సఖులను. బరిహాసకులను వెంట వేసికొని యొఱపుగల తీవితోఁ దిరుగు నాజాతి మాత్రోపజీవి ధూర్తవిట సార్వభౌమత్వ మింతది యంతది యని నిరూపింపఁజాలము. అది రామకృష్ణుని గంటమునకు, దాని ప్రభావము నెఱిఁగిన రసజ్ఞులకును దెలియఁ దగినది.

నేతిబీరకాయవంటి నిగశర్మాభిధానముఁ దాల్చిన యా విప్రకుమారుఁడు హోమాగ్ని నూదనొల్లక, సంధ్యాంజలికి స్వస్తిచెప్పి, ఆగమవాదములం దడుగు పెట్టక, దుర్వ్యవహారపు నడవడిలో గడితేరి, గడుసుపడి, సడికోర్చి తాతతండ్రులు చీమలవలెఁ గూడఁబెట్టిన విత్తమును హరించివేయుట యనునది వాని జీవితములో మొదటిఘట్టము మాత్రమే. ధనవంతుఁడై, జీవత్తాతపాదుఁడై, దుర్విహారవిహారుఁడైన యువకుఁడు చేయఁదగిన పనులన్నియు నతఁడు చేసినాఁడు.

ఇంటిపెత్తనము స్వాయత్తమైనప్పటినుండియు సొమ్ములుకుదువవైచి, తల్లిపసిఁడిని గిలుబాడి. సాహులచే ఋణగ్రాహియై, గుడ్డవృత్తులు; గుత్తచేలు. గ్రామాంశములు, ఆధినేలలు, చనవరుల కమ్మఁజూపి పండువంటి సంసారమును పాడుచేసినాఁడు. తన భోగపరాయణత్వమునకుఁ గొఱవ వాటిల్లినప్పుడు పొందుపట్టులలో నెల్ల నప్పులు పొడిచినాఁడు. దొరతనపు టెక్కులోఁ జట్టాలను దిరిపమెత్తినాఁడు. ఒకటి యననేల యతఁడు చేసిన దూబర ఖర్చుకు హద్దులేదు.

ఇల్లనక నిల్లాలనకఁ దిరుగు నా తిప్పకాయకుఁ జలిదియన్నపుఁ గుక్కటతిలో తటస్థించిన యక్కగారి యుపదేశము తాత్కాలికముగా నిల్లు కదలనీక సంకెలలు వైచినది. అన్నపానకాంక్షతో నామె యుపదేశముల కప్పటికిఁ దల యొగ్గినాడు. అప్పటి వానినటనలు కుటుంబమువారి నేగాక తరువాతి భాగముఁ జదువని పాండురంగమాహాత్మ్యపఠితలను సైతము మోసపుచ్చినవి. ఔరా! ఎంతవాఁడు! మాసిన చదువులు మరలఁ జదువ నారంభించినాఁడు. కులవధూరత్నమును బలుకరించి మోదాగ్ప మొదలిడినాఁడు. అతిథిపూజలు, ఆచార్యసంభావనము, దేవతార్చనలు, పసుల నరసికొనుట, పైరుపచ్చలను దర్శించుట, తండ్రి మడిదోవతిని తానేయుదుకుట, బావగారితోఁ బరిహాసములాడుట, గ్రామకార్యములు దీర్చుట మొదలగు పనులను భక్తిశ్రద్ధలతోఁ జేయ నారంభించి యక్కగారి కానందమును, తల్లిదండ్రుల కామోదమును, పిన్న పెద్దల కాదరమును గలుగునట్లు మెలఁగినాఁడు. అంతటితో నాగినచో కథకంచికి మన మింటికిఁ బోయెదువారము. నిగళశర్మగాని రామకృష్ణుఁడు గాని అట్లుపో నిచ్చువారా! కారు గనుక నే తరువాతి కథ పిల్లిశీలముతో నారంభించినది.

ఒక్కనాటి రాత్రియందు గోమేధిక, పుష్యరాగ, వైడూర్య హీర నీలాది రత్నములతో స్థగితములైన మాతృభూషలు, అత్తికామండనములు, విజయువతి దాల్చు సొమ్ములు, తండ్రి దర్భముద్రికయుంగరమును, అక్కముక్కరను, బావగారి చెవుల పోగులను సైతము విడువక మూటగట్టుకొని పండుకొన్న పడకకుఁగూడఁ దెలియనట్లు పారిపోయెను. మోయలేని ధనముతో విగ్జనారణ్యమునఁ బోవునాతని దొంగలు కొట్టి ధన మపహరించికొని పోయిరి. "అత్యుత్కటైః పుణ్యపాపైరిహైవ ఫల మశ్నుతే" (అత్యధికముగాఁ జేయఁబడిన పుణ్యపాపములకీలోకమునందే ఫలము గలుగును.) యన్నట్లు వానికి దుర్గతి వచ్చి గాయపడి యరణ్యములో చిక్కటి యుండవలసి వచ్చెను. అప్పుడాదుకొన్న కరుణాళుఁడు, జానపదాగ్రగామియైన రెడ్డి వాని కాయువును బోసినాఁడు.

ఇంటికిఁ గొనిపోయి నెత్తురొత్తి, గాయములకుఁ జికిత్స చేయించి పథ్యపానములు పెట్టించిన కాఁపు కుమారునికే యెగ్గుఁదలఁపోసి ఆయింటి పంటదాని నెత్తుకొనిపోయిన నిగమశర్మ కృతఘ్నతకు పరిధియేమున్నది? “నరకేసతి కోదోషః మరణేసతికింభయ” మన్న చదువునతఁడు గట్టిగాఁ జదువుకొన్నాఁడు. కనుకనే పొన్నాకుపై తేనెవంటి దాని మోవికి, ఆమని బుగబుగలవంటి దాని తనూసౌరభమునకు, అభ్రచ్ఛాయవంటి దాని కచభరమునకుఁ జొక్కి, యొక్కసారి లేవనెత్తికొనిపోయి రెడ్డి యింటి గౌరవమును మంటఁగలిపి, తన కులగౌరవమును ధ్వంసముఁ జేసి యా పడుచుతో బోయలలోఁ గలిసిపోయినాఁడు.

అదియు మూన్నాళ్ల ముచ్చటయే యైనది. కాపు గెంజిగు రాకుఁబోఁడి పరలోకమును బ్రాప్తించినది. ఇక్కడ నొక చిత్రము ! ఇంతగాఁ బ్రేమించి తెచ్చుకొన్న పంటది చనిపోయినప్పుడు నిగమశర్మ కంటఁదడి యైనను బెట్టినట్లు లేదు. అట్టి యార్ద్రహృదయుఁడే యైనచో నింటిని, ఇల్లాలిని, ముదివగ్గులైన తల్లిదండ్రులను విడిచి రాఁగలఁడా? ప్రాణమొకెత్తుగాఁ గాపాడిన రెడ్డియింటికిఁ గీడును దలఁపగలఁడా? కనుకనే రామకృష్ణుఁడా విషయమునే యెత్తక మగల వ్యాపాదముఁ (ద్రోహ చింతనము) తో రూపాజీవరాజాననయైన యొక ప్లవకన్యను జేపట్టినట్లు చెప్పినాడు.

ప్లవకన్యాసంబంధము నిగమశర్మ పతితత్వమునకుఁ బరిమావధి. అపవిత్రమైన యాకళత్రమునందు సంతాన లాభము గలుగుటయు, వా రందఱు నొకనాఁడు తగులఁబడ్డ యింటిలో దగ్ధులై పోవుటయు నిగమశర్మ మదనాయాస ప్రబంధమునకు చరమాశ్వాసాంత గద్యము. అప్పుడు గొల్లుమని యేడ్చినాడు. ప్రియురాలిని, ఆమె నల్లనిరూపును దలఁచుకొని విలపించినాఁడు. ఇఁక ప్రేమప్రసంగమున కాస్పదములేదు. కనుకనే యడవులఁ బడిపోయి పూర్వ పుణ్యవశమున, లేక విధివిలాస పరివర్తనమునఁ బాండురంగ క్షేత్రమునఁ బడి మరణించి క్షేత్ర ప్రభావము వలన ముక్తి నొందినాఁడు.

ఇంతటి నీచప్రవృత్తి గలిగిన నిగమశర్మ పాత్రమును చిత్రించిన పట్ల సాధించిన ప్రయోజనములు రెండు. ఎంతటి పాపియైనను క్షేత్ర మహిమచే ముక్తినొందు ననుట పౌరాణిక ప్రయోజనము. నిగమశర్మ ధూర్తత్వము వ్యంగ్యవాసనా విలసనముచేత వైదికయువకులనుఁ జక్క దిద్దుట సాంఘిక ప్రయోజనము. ఇందులో నొకటి కథది. యొకటి సంఘముది. ఆద్యంతములందు బిగువు చెడనీయక దిద్దఁబడిన నిగమశర్మ పాత్రము వ్యతిరేకోదాహరణమై కులీనులైన యువకులను హెచ్చరించు చున్నది.

## నిగమశర్మ అక్క

పూర్వకవులు తమ కవిత్వమును రాజులకు, రాజాంతఃపురములకు, శృంగారమునకు, అతిశయోక్తులకు నంకితము చేసిరన్న యపవాదుకు రామకృష్ణుఁ డంతగా గురి కాఁడు. ఆసడి నుండి యతనినిఁ గాపాడినది నిగమ శర్మోపాఖ్యానము. అందును ముఖ్యముగా "పేరులేని పేరంటాలైన" నిగమశర్మ అక్క. ఈ ముత్తైదువ సంపన్న వైదిక గృహస్థుని యాఁడు బిడ్డగాఁ జిత్రింపఁబడినది. పుట్టినింటిపైఁ గల ప్రేమ, సంసారమును జక్కదిద్దగల మెలఁకువ యామెలో మూర్తిభవించినవి. తమ్ముని దుర్విదగ్ధతతోఁ బుట్టినింటికిఁ గలిగిన దుస్థితి, పువ్వులుముడిచిన యంగళ్లనే కట్టెలు మోసినట్లు నగుబాటుపాలైన సోదరుని గౌరవదూరత్వము చెవినిఁబడఁగా నేపంచయోజనమాత్రదూరమైన యత్తింటినుండి భర్తను, పిల్లలను వెంటదీసికొని వచ్చినది. పిలువకయే వచ్చి తనయక్కఱకు వచ్చు చుట్టరికమును నిలువఁ బెట్టుకొన్న యామె యాఁడుపడుచుఁదనము శ్లాఘింపఁదగినది. వచ్చుసరికి సన్నాహములేని యాయిల్లు చికాకు గలిగించునదిగా నుండెను. తల్లిదండ్రులు మంచపుఁదొడుగులై యొకచోఁ బడియున్నారు. నిగమశర్మ యింటలేఁడు. విద్యార్థులు లేరు. పశువులు బందెలలో బడిపోయినవి. పైరుపచ్చలను విచారించువారు లేరు. ఇంకొకయాఁడుబిడ్డ యగుచో వెంటనే తిరిగిపోయి యుండును. ఈమె వచ్చినది సంసారమును జక్కదిద్దుటకు గాని సారెలు, చీరెలు గొనిపోవుటకుఁగాదు.

కనుక గృహపరిస్థితుల నవగతముఁ జేసికొనుటకై కొన్నిరోజులు కిమ్మనకుండఁ గడిపినది.

మొదట తల్లిదండ్రులను విచారించుటయే తనపనిగాఁ బెట్టుకొన్నది. నెమ్మదిగా మందిరముకుందారాధనలు, అతిథి సంతర్పణలు నేర్పుతో నారంభించినది. జనయిత్రీదర్శితమైన నష్టావశిష్ట ధనమును దాచియుంచినది. మెల్లగా శిశు, దాస, దాసీ జనములను దనవారినిగా మెలగించుకొన్నది. పరహస్తగతములై నామమాత్రావశిష్టము లయ్యును, పడమటింటిలోఁ బడి దీపపు సెగకుఁ గాలియు, క్రిమ్యాది మంటఁగలసియుఁ బాడయిన పుస్తకభాండాగారమును భర్తతోఁ జక్కపరపించినది. క్రమముగా నన్నిటిని సవరించి, చదువు సంతలు సాగించి, విగళిత సన్నాహమైన గేహమును యథాపూర్వ నిర్వహణ మనోహరముగా దిద్దినది. ఇంచుమించుగాఁ బాడుపడ్డ యింటిని పండుగనాటి వైభవమునకుఁ ద్రిప్పి తన కర్తవ్యములో నొక మెట్టు నెక్కినది.

ఇఁక బయటి వ్యవహారములలో రాజానుగ్రహ లబ్ధములైన భోగగ్రామములను స్వాధీన పరచుకొనుచు, తప్పిదారిన చేనుపట్లున్న చోటులరసి, తనకుమారులను కాఁపుపెట్టుచు నాదాయమువచ్చు పద్ధతులను గల్పించి కొంతవరకు సంసారము నొకస్థితికిఁ దెచ్చినది.

కాని మఱఁదలి దుస్థితినిఁ జూచినప్పుడు మాత్ర మామెకడుపు చుమ్మలుచుట్టుచుండెను. అనివార్యజృంభణముగల మఱఁదలి యౌవనారంభ మడవిఁగాచిన వెన్నెల కాఁగా దానికిఁ బ్రతివిధేయము లేక జాలి పడిన యామెనిండుతనము, సరళహృదయత ప్రశంసింపఁ దగినవి.

ఇన్నాళ్ళవరకింటికి రాక యెక్కడనో తిరుగుచు నాకలిచే నకనకఁ బడుచున్న నిగమశర్మ ఒక్కనాఁ డెక్కడనుండియో చుక్కదెగి పడినట్లు పద్దియన్నము కోసరమని యింటికి వచ్చువఱ కక్క ప్రత్యక్షమైనది! వెన్న చటుక్కుమని జంకినాఁడు. కాని యెటుపోఁ గలఁడు? పోలేక నిలిచి నమస్కరించినాఁడు. అట్లు నిలిచి తలవంచికొని యున్న తమ్ముని వేష

మును బరికించినది. మత్త కాశినీ దత్త నఖాంకములచేఁ గర్కశమైయున్న యతని మేనును గౌఁగిలించుకొనుటకు మనసు గొల్పక విదగ్ధాలాపములతో సీమంతపుఁ బెండ్లికొడుకవు గమ్మని యాశీర్వదించినది. తన వెన్నుదన్ని పుట్టిన తమ్ముఁడు గాన నంతకన్న గఠినముగా మందలించినఁ దట్టుకొనలేని యతని సుకుమార హృదయము నామె యెఱుఁగును. కనుకనే కోరగిల్లిన దృష్టిని చల్లఁబఱచుకొని, వినయ సౌహార్ద మార్దవ మధురములైన మాటల తేటలతోఁ బందిరివెట్టి యతనినిఁ జల్లఁబఱచినది. అప్పటికినిఁ గాలుకదల్పఁదలచు నతనికిఁ జఱుత మేనల్లుని, నిందుబింబము వంటివాని నిందచుని చంకకిచ్చి, యతని యాకలి నకనక నెరింగినది గావున నిమిషంబులోన శాకపాకంబులు గావించెద మీబావపంక్తి నారగింతువు గాని నిలుమని నిలిపినది. ఇంత చాతుర్యముతోఁ దమ్ముని కాళ్ళకు పూలసంకెలలువైచిన ఆ యక్కకు మఱఁదలి కవకాశము నొసఁగు నేర్పు దెలియకుండునా? వెంటనే కనుసంజ్ఞ చేసినది. గుట్టిక యిన్నాళ్ళనుండి నలఁగియున్న ఆ పైఁదలి వెంటనే ప్రాణేశ్వరుని పాదద్వయముఁ గడిగి నిజ నిశ్వాసజ తాపముతో నాతని పాదముల తడియొత్తినది.

గడుసుఁదనమున మఱఁదలి కవకాశము నిప్పించి నిగమశర్మకుఁ దల గడిగించి, ధౌతపరిధాన మిప్పించి, అలకల తడియారిచి, విరులు కీలించి గంధము పూయించి అందఱి పంక్తిలో భోజనము పెట్టినది. గ్రుక్కు మిక్కు మనకుండ నిగమశర్మ అక్కగారు చేసి మఱఁదలితోఁ జేయించు నుపచారము లందుకొనసాగినాఁడు. ఏమనఁగలఁడు? తమ్ముని కక్కగరు వఁదనము తెలియదా? తెలియును. కనుకనే భార్య యిచ్చినవి డెమునే తినుచు మహాశిష్టునివలెఁ దిన్నెపైఁ గూర్చున్నాఁడు. ఈలో భోజనము ముగించుకొనివచ్చి తమ్మునితల దువ్వి యాల్లుగ్రుక్కి చేతులుగడుగుకొని చేటికదెచ్చిన పీటపైఁ బద్మకర్ణికయందుఁ బద్మవలె నాసీన యైనది. ఇంతకన్న దమ్ముని మందలించుట కవకాశము చిక్కదు. కనుక తనవచ్చి నవనిని పరిసక్తికిఁ దెచ్చినది.

"ఏమితమ్ముఁడా!" యని సంబోధించి నన్నుఁ జూడనైనా రాలేదే! ప్రారంభించిన వేదపాఠమునకు ప్రత్యూహము గల్గునని భావించితివా?

యని మెల్లగా నుల్లసమాడినది. కాని యుల్లసములు సహింపఁగలఁడా నిగ్గమశర్మ! కనుక వెంటనే స్వరము మార్చి తమయింటి గొప్పతనమును తండ్రిగారి యుద్వేలస్ఫూర్తిని బ్రశంసించి సాలగ్రామఖనిలో జాత్యల్ప పాషాణమవగుదువా నాయనా! యని మందలించినది. పరమేష్ఠితరము నుండి నీదాఁక బవిత్రమైన వంశమును, కాటికిఁ గాళ్లుసాచియున్న తల్లిదండ్రులను, అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన యిల్లాలిని, పండిత సత్కార గౌరవములను దలపక భేలవైతివేల సోదరా! యని తన మనమునఁ గల వెతను వెళ్లఁబోసికొన్నది. ఈ పల్కినమాటలలోనుఁ గొంత కోపము వెల్లడి యయ్యెనేమో! యని తల్లిదండ్రులను, తమ్ముఁగుఱ్ఱలను, నవీన కులాంగనను, పసులను, బంటుబైదలను బ్రసక్తికిఁ దెచ్చి కర్ణునితలపై భారతమువలె మనసంసారమంతయు నీమీఁదనే యాధారపడి యున్నదని మృదువుగాఁ జెప్పినది. నేనందరితోను నీవుచేయు యజ్ఞమున వేదిపై పేరంటాలనై మర్యాదలు బొందుదునని చెప్పుకొంటిని. నీ వేదియు లేక యిట్లుంటివని కన్నుల నీరు బెట్టుకొన్నది.

త్యాగభోగములకై తమ్ముఁడు వెచ్చించు విషయమునఁ దనకు మచ్చరము లేనట్లు సూచింపఁగోరి వీరావేశముతో సర్వధనమును వెచ్చించిన వెచ్చించితివి. కాశ్మీరఖండములవంటి వరిమళ్లను దెగనమ్మితివి. ముందెట్లు బ్రతికెదవు? నిర్దారుడవా? వెనుక నెవ్వరును లేరా? కులధ్వంసము నీకర్హమా నాయనా! యని కన్నీరు గార్చినది. అతనిభోగలాలసత్వమునందుఁ దనకీర్ష్య లేదని సూచించుటకై నూర్గురు విప్రకన్యలను బెండ్లాడినచో నిన్నువద్దనువారెవరు? దుశ్శీలాగారమైన వారయోషావతము పొందు నీ కెందుకు తమ్ముఁడా! వారి పిలుపిచ్చు విద్యలవి. వారి నయగారములకు రాజులవంటివారు తట్టుకొనలేరే, మనసంసారమాగునా? [illegible] బోధించి, వేశ్యాదూషణమును చమత్కారముగాఁ జేసినది. ఇఁకమీఁదనైన నీయవివేకమును విడిచి నేనుచెప్పినట్లు నడుచుకొమ్ము. నీకుఁగావలసినచో హరికౌస్తుభమునైనఁ దెచ్చియిచ్చెద నని తనసంపూర్ణ సహకార గౌరవాదరములను బ్రకటించినది. అతఁడు తాత్కాలికముగా నక్కకు లొంగిపోయినాడు. అతనిచర్యలనుజూచి అక్క మురిసిపోయినది.

నాయత్నము ఫలించెనని యనుకొన్నది. ముందు రానున్న విషయ మామె కేమి తెలియును! పిమ్మట నిగమశర్మ చేసిన దొంగతనముతో అక్క మనస్సు చివుక్కుమన్నది. ముక్కర యెత్తుక పోయినందులకును దనయత్నము లచిరములోనే నీటిపాత లగుటకును వలవల యేడ్చినది.

ఇది పేరులేని పేరంటాలైన నిగమశర్మ అక్క స్వరూపము. ఇట్టి యున్నత గుణవిరాజితమై, యింత సహజముగా నడిచిన పాత్రము మరి యే ప్రబంధము నందును గానరాదు. పాండురంగ మాహాత్మ్యములోనే లేదు. రామకృష్ణుని యనల్ప శిల్ప నైపుణి ఈమెలోఁ గరువుగట్టియున్న దన్నచో సత్యదూరముగాదు. ఇట్టి యుత్తమ పాత్రమును జిత్రించిన రామకృష్ణుఁడు ధన్యుఁడు.

## కాఁపు కుపహారుఁడు

అరణ్యమధ్యమున దొంగలచేఁ గొట్టఁబడిన నిగమశర్మను గరుణాశాలియై యింటికిఁ దెచ్చిన యీ యమాయిక గృహస్థునిలో గ్రామీణ మానసిక ప్రవృత్తి చక్కగాఁ బ్రతిబింబించినది. ఇతఁడు నిగమశర్మకుఁ జేసిన పరిచర్యకు మేరలేదు. వేళ్ళతో నెత్తురులొత్తినాడు. గాయములలో వత్తులెక్కించినాడు, శరీరమున నాటిన శస్త్రముల నూడబెఱికినాఁడు. పొత్తులువెట్టి నిగమశర్మను నిద్రఁబుచ్చినాడు. వట్టికూటితో వేనీళ్ళతో పథ్యము పెట్టించి వైద్యునికి జాగ్రత్తసుమాయని కంటవత్తిడి కొని కాపాడినాడు. కొంచెము తేరుకొన్న నిగమశర్మ చెప్పు మాటల నమ్మి యతనిని తననాతితో జాతితో దేవుఁడుగా గురువుఁగా అప్పుఁడుగా నమ్మినాడు పాప మా జానపదాగ్రగామి! చివరకి తలలో నాలుకయై పూసలలో దారమై నిగమశర్మతో నభిన్న భావమును బొందిన యా సైరిక ప్రభుని నిర్వ్యాజకారుణ్యము, నిర్హేతుకవాత్సల్యము, నిరుపమాన ఋజుభావము వేనోళ్ళబొగడఁ దగియున్నవి. రామకృష్ణకవి యీ పాత్రముద్వారా జానపదుల స్వభావశీలములను జక్కగా వ్యక్తపరచినాఁడు.

## కాఁపు కోడలు

ఈ కోడలు చెదరు చూపులు గలది. కనుకనే యింట స్వతంత్రముగాఁ దిరుగు బావనిఁ గోరినది. తన తమకమును వెలిబుచ్చుటకీ జగనీలిపిసాళిజంత చేసిన చేష్టలు బహుసహజముగా వర్ణితములైనవి. చేనికిఁ బోయినప్పుడు పనులుచేయక దిష్టిగొట్టినదని తలకు పట్టుగట్టుకొని చెరగు పరచుకొని గ్రుడ్ల నీరుగ్రుక్కుకొనుచుఁ బండుకొన్న యీ పంట దాని గొంటుఁదనము మిక్కిలి రమణీయముగా నున్నది. ఈమె నటనలను విటసార్వభౌముఁడైన నిగమశర్మ పసిబట్టి యవి తనయందే సమధిరూఢము లగుటచేతఁ గృతఘ్నుఁడై రెడ్డియింటికెంతయెగ్గు చేయవలయునో యంత చేసినాఁడు. యీపాత్రము నిగమశర్మకుఁ దగినట్లుగాఁ బోషింపఁ బడుటయేగాక యిందు పల్లెటూరి గడుసుపడుచు దుశ్శీల మతిసహజముగా విలసింపఁ జేయఁబడినది.

## గాలి గంగల జాతర

ఇది కాపుంగొంజిగురాకుఁబోఁడిని పతితద్విజుఁ డెత్తుకొనిపోవుటకవకాశ మొసఁగిన ఘట్టము. ఈ కల్పన యొక్క ఫలముసైతమదియే. కాని జానపదుల జీవితమును, వారి సాంఘికాచారములను జక్కగాఁ జిత్రింపఁ దలఁచుకొన్న రామకృష్ణునికి మఱియొక యవకాశము చిక్కినది. జాతరలలో గ్రామజనులేమి చేయుదురో యెట్లు కైసేసికొందురో చక్కగా వర్ణించినాడు. చమురంటుకొని జలకమాడుట, చిలుతచాకముల క్రొంబుట్టములు గట్టుకొనుట, కన్నుల కాటుక దీర్చుకొనుట, చెందిరపు బొట్టుపెట్టుకొని నిక్కుసిగలలో విరులు గ్రుక్కుకొనుట మొదలయిన గ్రామ్యాలంకార వైఖరినిఁ జక్కగాఁ బొందుపరచినాడు. గుడ్డమువిూఁద వేపతోరణముగట్టి కైసేసిన మహాశక్తిగుడికి సడ్డలేనవ్రేఁగై సేతలతో రద్దులు పురస్సరద్వాభర్యముగా నడచినట్లు వర్ణించి యతిసహజముగాఁ గథను నడపినాడు. శక్తిగుడిముందు సిడివ్రేలిన తెరవలను, నిప్పుకోట నడచిన నాతులను, పందిరిగుండ మీఁగిన యింతులను, అనఁటాకువ, వర్ణించిన యాజివలను, మూఁపుకండల నిచ్చిన ముగ్ధలను, మూరు

గాలిచ్చిన మధుర వాణులను మరువక చిత్రించి గాలిగంగల జాణతన చాతుర్యము మీర రచించిన రామకృష్ణుని రచనా ధౌరంధర్యము స్మరణీయమైనది. ఇట్లు పాత్రపోషణ కథాచమత్కృతు లందద్వితీయతం గాంచిన నిగమశర్మోపాఖ్యానము పాండురంగ మాహాత్మ్యమునకు మకుటాయమానము.



